# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 | సెప్టెంబరు 1997 | సంచిక 9

## విషయసూచిక



ఎడిటర్: వి. కె. నరసింహన్

**1997 అక్టోబర్, నవంబర్ నెలలలో ప్రశాంతినిలయంలో జరుగు కార్యక్రమములు**

అక్టోబర్ 4 నుండి 10 వరకు : వేదపురుష జ్ఞానయజ్ఞ సప్తాహం
నవంబర్ 8వ తేది : ప్రపంచవ్యాప్త అఖండ భజన
(నవంబర్ 8 సాయంత్రం 6 గంటల నుండి నవంబర్ 9 సాయంత్రం 6 గంటల వరకు)
నవంబర్ 22వ తేది : శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ 16వ స్నాతకోత్సవం
నవంబర్ 23వ తేది : భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి 72వ జన్మదినోత్సవం




సంవత్సర చందా: తెలుగు లేక ఇంగ్లీషు (ఒక్క సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడును)

ఇండియాలో : రూ. 30/-

విదేశాలకు : ఎయిర్‌మెయిల్ - రూ.240/- లేక యు.ఎస్.డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5
సీ మెయిల్ - రూ.120/- లేక యు.ఎస్.డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా : కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,
ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515134

సాధారణ సమాచారము: (1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా పెద్ద అక్షరములతో వ్రాయవలెను.
(2) భారత దేశములో ఏ చోటకయినా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టు ద్వారాగాని చెల్లించవచ్చును. (3) క్రొత్త చందాయో లేక రెన్యువల్ చందాయో తెలియపరచవలెను. రెన్యువల్ అయినచో ప్రస్తుత చందా నెంబరు వ్రాయవలెను. (4) రెన్యువల్ కోరునప్పుడు చందా గడువు ముగియుటకు రెండు నెలలు ముందుగా తిరిగి చందా రుసుమును పంపవలెను. (5) ఈ పత్రిక శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టువా తరపున శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్, ప్రశాంతినిలయంలో ముద్రించబడినది.


ఫ్యాక్స్ : 0091-8555-87236/87390, గ్రామ్స్ : 'బుక్‌ట్రస్ట్' టెలిఫోన్ : 87375, STD కోడ్ : 08555, ISD కోడ్ : 0091-8555

# "మమైవాంశో జీవలోకే..."

"కానబడుచున్నట్టి జగతిలో కానరాక
అందు వెలుగొందు చైతన్య మాత్మరూపు
మణులయందలి సూత్రంబు మాదిరిగను
విశ్వమంతయు నిండెను విశ్వవిభుడు."

ప్రేమస్వరూపులారా!

ఎవరికైనా ఒక చిన్న ఉత్తరం వ్రాయాలంటే ఏమి వ్రాయాలి? ఎట్లా వ్రాయాలి? అని మొదట మనస్సులో చింతించి తరువాతనే పేపర్‌పై వ్రాస్తున్నాము. అనగా భావము మొదట, ఆచరణ తరువాత. కనుక మొట్టమొదట మనం మానవత్వ మంటే ఏమిటో, దివ్యత్వమంటే ఏమిటో మనస్సులో చింతించాలి. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అన్నది వేదాంతం. మనం దేనిని చింతిస్తే దాని స్వరూపాన్నే పొందుతాము. దారులు కొట్టే దొంగ అయిన రత్నాకరుడు మహర్షుల బోధలచేత నిరంతరము రామనామాన్ని స్మరిస్తూ రామరూపాన్ని ధ్యానిస్తూ ఉండటంచేత కొంతకాలానికి అతని ముఖంలో రామతేజస్సు ఉట్టిపడింది. బాలుడైన ప్రహ్లాదుడు నిరంతరము శ్రీమన్నారాయణుని చింతన చేయడంచేత అతని ముఖపద్మంపై నారాయణుని తేజస్సు ప్రకాశిస్తూ వచ్చింది. పూర్వం డార్విన్ తన గురువైన హెన్‌స్లో అంతటివాడుగా తాను కూడా తయారు కావాలని నిరంతరము అతనినే అనుసరిస్తూ రావడంచేత కొంతకాలానికి వారిరువురూ ఒకే తేజస్సుతో కనిపించారు. అనగా మనం దేనిని స్మరిస్తామో, దేని గురించి ఆలోచిస్తామో ఆ స్వరూపాన్నే పొందుతాము. కనుక మనం మంచిని చింతించి, మంచిని గురించి ఆలోచించినప్పుడే మానవులుగా రూపొందగలము, మాధవత్వాన్ని చేరగలము.

**మానవుడు దైవాంశమే!**

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః", "ఓ మానవుడా! నీవు నా అంశమే. కనుక నా భావములే నీలో ఆవిర్భవించాలి" అన్నాడు గీతాచార్యుడు. ఇట్టి సత్యాన్ని గుర్తించక అనేకమంది సాధువులు కూడా కష్టాలకు, బాధలకు గ్రుంగిపో తుంటారు. నీకు కష్టాలున్నాయని భావిస్తే నీవు పరమాత్మ యొక్క అంశమెట్లవుతావు? పరమాత్మకు ఎట్టి కష్టములూ లేవు, ఏ బాధలూ లేవు. కాబట్టి ఏవో బాధలు, కష్టాలు కలిగాయని నీవు విచారించకూడదు. ఏ పశుత్వమో, రాక్షసత్వమో, చంచలత్వమో నీలో ప్రవేశించడంచేతనే నీవు కష్టనష్టములకు గురి అవు తున్నావు. ప్రతి మానవుడు దైవాంశమే! కాని ఈ సత్యాన్ని గుర్తించినవారు బహుకొద్దిమంది మాత్రమే. అలాంటివారే నిజమైన మానవులు. అయితే దైవచింతన చేయనివారు కూడా ఈ లోకంలో బ్రతుకుతున్నారు కదా అని నీవంటావేమో! బ్రతుకుతున్నారు, నిజమే! కాని ఏవిధంగా బ్రతుకుతున్నారు? పశువులవలె బ్రతుకుతున్నారు, పశువులవలె ప్రవర్తిస్తున్నారు, తత్ఫలి తమును అనుభవిస్తున్నారు. కాని తాను దైవాంశ మేనని విశ్వసించే మానవుడు నిత్యానందమునే పొందుతాడు, పరమసుఖమునే అనుభవిస్తాడు.

**స్మరణ కాదు, అనుస్మరణ చేయాలి**

ఒకానొక సమయంలో అర్జునుడు, "కృష్ణా! నేను నీ స్మరణే చేస్తున్నాను కదా! అయినా

నా కీ కష్టాలెందుకు?'' అన్నాడు. అప్పుడు కృష్ణుడు, ''అర్జునా! స్మరణ చేసినంత మాత్రమున చాలదు, అనుస్మరణ చేయాలి'' అన్నాడు. స్మరణ అనగా ఏదో ఒక కాలంలో, ఒక ప్రదేశంలో ఒక నియమాన్ని పురస్కరించుకొని స్మరించడం. అనుస్మరణ అనగా సర్వకాలసర్వావస్థలయందు స్మరించడం. ''అర్జునా! నీవొక కాలమును, ఒక నియమమును పురస్కరించుకొని మాత్రమే నన్ను స్మరిస్తున్నావు. ఇది సరియైన స్మరణ కాదు. అనుస్మరణ చేయి, ఎప్పటికీ నేను నీ వెంటనే ఉంటాను.''మాం అనుస్మర యుధ్యచ'' యుద్ధంలో కూడా నన్నే స్మరిస్తూ ఉండు. అదే నీ కర్తవ్యం. నన్ను నీ రథంపైన కూర్చోపెట్టుకున్నంత మాత్రమున సరిపోదు, నీ హృదయపీఠంపై నన్ను కూర్చోపెట్టుకో. యంత్రము బయటిది, మంత్రము లోపలిది. నీవు నన్ను బయట కూర్చోపెట్టుకున్నావు కాని, నీలోపల కూర్చోపెట్టుకోలేదు'' అన్నాడు. అప్పుడర్జునుడు, ''కృష్ణా! నీవు చెప్పేదంతా నిజమే గాని, నేను సామాన్య మానవుడను. అంతటి ఉన్నత స్థాయికి ఏ రీతిగా చేరగలను?'' అని ప్రశ్నించాడు. ''అర్జునా! నీవు నా ఆకారమును చూసి నేను కూడా నీ వలె ఒక సామాన్య వ్యక్తినని భ్రమిస్తున్నావు. నా తత్వాన్ని గుర్తించాలంటే నీకింకా కొంతకాలం పడుతుంది'' అన్నాడు.

## దుష్టభావాలను తరిమివేయ్

భగవంతుడు ప్రేమస్వరూపుడు. కనుక నీవు కూడా ప్రేమస్వరూపుడవు కావాలి. అదెట్లా సాధ్యం? ''బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి'', నీవు దేనిని స్మరిస్తావో ఆ స్వరూపాన్ని పొందుతావు. డార్విన్, ప్రహ్లాదుడు, నారదుడు, వాల్మీకి ఆవిధంగానే మారారు. నీవు కూడా నీ కిష్టమైన రూపనామముల నెన్నుకొని దైవచింతనలో నీ జీవితాన్ని అంకితం గావించు. దుష్టభావములనేమాత్రము నీ హృదయంలో ప్రవేశించనీయవద్దు. ఒకవేళ అవి ప్రవేశించినా వెంటనే తరిమివేయ్. నీవొక ఇల్లు కట్టుకున్నావు, ఇంటికి ద్వారములు పెట్టుకున్నావు. ఎందుకోసం? నీవు, నీ బంధుమిత్రులు రావడానికి, పోవడానికి. అంతేగాని ద్వారములున్నాయి కదా అని బజార్లో పోయే గాడిదలను, పందులను లోపలికి ప్రవేశపెడతావా? లేదు, వాటిని తరిమికొడతావు. అదేవిధంగా దుష్టభావాలు నీలో ప్రవేశిస్తే తక్షణమే వాటిని తరిమివేయ్, మంచిభావాలకు స్వాగతం పలుకు.

## భగవంతుడు భావప్రియుడు

భగవంతుడు ప్రేమ తప్ప మరొకటి కాదు. భగవంతునికి మనం ఇచ్చేది కూడా ఏమీ లేదు. కనుక భగవంతునికి ఇంత పెట్టాను, అంత పెట్టాను అని అనుకోకూడదు.

''ఓ భగవంతుడా! నాకేది ఇచ్చావో అదే నీకిస్తున్నాను. నా దనేది ఏమీ లేదు. అంతా నీ విచ్చినదే! నీ విచ్చినది తిరిగి నీకే ఇస్తున్నాను'' అనే పవిత్రమైన అర్పితభావాన్ని కల్గియుండాలి. 'నేను ఐదువందలమందికి అన్నం పెట్టించాను. ఐదువందలమందికి చీరలు, పంచెలు పంచిపెట్టాను' అని భగవంతునికి చెప్పవద్దు, కావాలంటే ఇన్‌కమ్ ట్యాక్స్‌వారికి చెప్పుకో. నీ వేభావంతో ఇచ్చావనేది మాత్రమే భగవంతుడు చూస్తాడు. ప్రేమ భావంతో ఇంత తులసీదళం ఇచ్చినా అదే గొప్పదిగా మారుతుంది. ప్రేమతో ఇవ్వాలి, హృదయపూర్వకంగా అర్పితం చేయాలి.

## అపేక్ష మారకం, అనపేక్ష తారకం

ఒక కళాశాల నుండి మరొక కళాశాలకు బదిలీ అయిన ప్రిన్సిపాల్ ఆ కళాశాల తాలూకు కుర్చీలను, బల్లలను ఎలా వదలిపెట్టి పోయేది?! అని విచారించడు. అదంతా గవర్నమెంటుదేకాని తనది కాదనే అనపేక్ష భావమే దీనికి మూలకారణం. వాటికి తానొక గార్డియన్‌గా ఉంటూ వాటిని సంరక్షించుకుంటూ ఉంటాడేకాని, అవి తనవనే

భావం అతనికి ఉండదు. ఈ అనపేక్ష భావమే తారకము. ఇంత మారక మంటే ఏమిటి? అదే ప్రిన్సిపాల్ మరొక గ్రామానికి బదిలీ అయినప్పుడు తన ఇంటిలోని సామాగ్రినంతా ప్యాక్ చేసి లారీలో వేసుకొని తీసుకు వెళతాడు. పాతచెప్పులను కూడా లారీలో పడేస్తాడు; చివరికి పరకను కూడా వదలిపెట్టడు. అవన్నీ తనవనే మమత్వమే దీనికి మూలకారణం. ఈ అపేక్షభావమే మారకము. సర్వమూ నాదనుకోవడం మారకము, ఏదీ నాది కాదనుకోవడం తారకము. ఏదీ మనది కాదు, అంతా దైవానుగ్రహ ప్రసాదమే. బదిలీ అయిన ప్రిన్సిపాల్ కళాశాలలోని సామాగ్రి అంతా గవర్నమెంటుదని గుర్తించి ఏవిధంగా దానిని వదలిపోతున్నాడో అదేవిధంగా మన సర్వస్వం భగవంతునిదే అని గుర్తించి వర్తించాలి. అయితే ఈ ప్రపంచంలో ఉన్నంతవరకు భార్యాబిడ్డలను, కుటుంబమును, ఆస్తిపాస్తులను చూసుకోవలసిన బాధ్యత ఉన్నది, నిజమే! కాని ఇది మీకు భగవంతుడు అప్పగించిన బాధ్యతగా భావించి మీ కర్తవ్యాన్ని నిర్వర్తించాలిగాని, ఇదంతా నాది అనే మమత్వాన్ని పెంచుకోకూడదు; ఇదే జీవితానికి ఆధారమని భావించకూడదు. ఎప్పుడు దీనిని వదలుతామో ఎవ్వరికీ తెలియదు. కనుక జీవించినంత వరకు మన కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి, ఇదంతా దైవవరప్రసాదమని భావించాలి.

## ఆనందం మానవుని సహజలక్షణం

నీవు నిరంతరము ఆనందం కావాలని ఆశిస్తున్నావు. కాని ఆనందమే నీవై ఉన్నావనే సత్యాన్ని గుర్తించుకోలేకపోతున్నావు. ఏడ్చేవానిని చూస్తే అందరూ గుమిగూడి ఎందుకయ్యా ఏడుస్తున్నావని ప్రశ్నిస్తారు. కాని ఎవరైనా ఆనందంగా ఉంటే, ''ఎందుకయ్యా నీవు ఆనందంగా ఉన్నావు? ఎందుకు ఏడ్చటం లేదు?'' అని ఎవరైనా అడుగుతారా? అడుగరు. ఎందుకంటే మానవునికి ఆనందం సహజం, ఏడుపు అసహజం. కనుక నీవు నిరంతరము ఆనందంగా ఉండాలి, చింతకు అవకాశ మివ్వవద్దు. చక్కగా యోచన చేయి - ''భగవంతునికి విచారముందా? లేదు. భగవంతునికి చింత ఉందా? లేదు. నేను భగవదంశమే కాబట్టి నేను కూడా విచారించకూడదు, చింత చేయకూడదు'' అని నిర్ణయం చేసుకో. ఈవిధమైన సాధన చేసినప్పుడే నీవు సరియైన స్థితిని పొందుతావుగాని, సాధన పేరుతో ఊరికే జపమాల త్రిప్పుతుంటూ కూర్చుంటే ప్రయోజనం లేదు. మొట్ట మొదట మనస్సును సరియైన రీతిలో పెట్టుకో. ఏ పని చేసినా అది భగవత్కార్యమని భావించు. నాది, నీది అనేది లేదిక్కడ, అంతా భగవంతునిదే! ఏవిధంగానైతే కళాశాల ప్రిన్సిపాల్ తనకు ట్రాన్స్‌ఫర్ అవుతూనే కళాశాలలోని సామాగ్రినంతా వదలివేసి వెళ్ళిపోతాడో అదేవిధంగా, నీవు కూడా ఏదో ఒకనాడు అన్నీ వదలిపోవలసిందే! కారణమేమిటి? ఇవన్నీ నీవి కావు. వీటిని నీవు వచ్చే సమయంలో తీసుకురాలేదు, పోయే సమయంలో తీసుకుపోవు. భగవంతుడు ఇవన్నీ నీకు మధ్యలో పెట్టాడు, బాధ్యత ఇచ్చాడు, పని చేసుకొమ్మని చెప్పాడు. ఆ పనిని నీవు సక్రమంగా చేయాలి. ఇదే భగవంతుని ఆదేశము. దీనిని శిరసా వహించినప్పుడే భగవత్తత్వాన్ని అనుభవించగలవు.

## కృష్ణతత్వం

'కృష్ణ' అనే పదమునకు మూడర్థము లున్నవి. ఒకటి: 'కృషితీతి కృష్ణః' అనగా, మన హృదయమనే క్షేత్రంలో దుష్టభావములనే కలుపు తీసి ప్రేమతో నింపి భగవన్నామమనే విత్తనమును నాటేవాడు కృష్ణుడు. రెండవది :''కర్షతీతి కృష్ణః'' అనగా మాటలతోను, పాటలతోను సర్వులను ఆకర్షించేవాడు కృష్ణుడు. ఈ ఆకర్షణశక్తి అందరియందు ఉన్నది. కాబట్టి అందరూ కృష్ణస్వరూపులే. ఇంక మూడవది: 'కుషితీతి కృష్ణః' అనగా అందరికీ ఆనందము కలిగించేవాడు కృష్ణుడు.

## దివ్యత్వంపై సందేహాలకు మూలం దేహాభిమానం

గోకులంలో ఒకనాడు కుంభవృష్టి కురిసింది. అప్పుడు చిన్నపిల్లవాడైన కృష్ణుడు అందరినీ పిలిచాడు. ''నే నీ పర్వతము నెత్తుతాను. మీరు దీని క్రింద తల దాచుకోండి'' అన్నాడు.

*'బాలుం డీతడు కొండ దొడ్డది మహా భారంబు సైరింపగా*
*జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపగా బోల దీ*
*శైలాంభోనిధి జంతు సంయుత ధరా చక్రంబు పై పడ్డ నా*
*తేలల్లాడదు బంధులార! నిలుడీ క్రిందం బ్రమోదంబునన్'*

కృష్ణుని మాటలు విశ్వసించినవారు అక్కడికి వెళ్ళారు. కాని కొందరు మాత్రం, ''ఇంత పెద్ద పర్వతము నితడే రీతిగా మోయగలడు?'' అని సందేహించారు.

ఒకానొక సమయంలో బలరాముడు కృష్ణుని దివ్యత్వాన్ని యశోదకు గుర్తింపజేయాలని ఒక యుక్తి పన్నాడు. ''అమ్మా! కృష్ణుడు మన్ను తిన్నాడు'' అని చెప్పాడు. యశోద కృష్ణుని చేయి పట్టుకొని, ''కృష్ణా! మన ఇంట్లో వెన్న లేదా? కావలసిన పదార్థములు లేవా? ఎందుకు నీవు మన్ను తిన్నావు?'' అని మందలించింది. అప్పుడు కృష్ణుడు కూడా తన దివ్యత్వాన్ని పరోక్షంగా ప్రకటిస్తూ తల్లితో అన్నాడు:

*'అమ్మా! మన్ను దినంగ నే శిశువునో యాకొంటినో వెఱ్ఱినో*
*నమ్మం జూడకు వీరి మాటలు మదిన్, నన్నీవు గొట్టంగ దా*
*రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు; కాదేనిన్ మదీయాస్యగం*
*ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్ దప్పైన దండింపవే!'*

''అమ్మా! నీవు నన్నొక సామాన్య బాలునిగా చూస్తున్నావు. నేను బాలుణ్ణి కాదు, వెఱ్ఱివాణ్ణి కాదు. చూడు నా నోరు'' అని నోరు తెరిచాడు. ఆమెకు కృష్ణుని నోటిలో అన్ని లోకాలు కనిపించాయి.

*'కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో*
*తలపన్ నేరక యున్నదాననొ యశోదాదేవి గానో పర*
*స్థలమో బాలకు డెంత, యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర*
*జ్వలమై యుండుట కేమి హేతువొ? మహాశ్చర్యంబు చింతింపగన్'*

''నే నేమైనా కలగంటున్నానా? లేక ఇది వైష్ణవ మాయయా? ఎందుకీవిధంగా కనిపిస్తున్నది?'' అని సందేహించింది. మనలో దేహాభిమానమున్నంత వరకు దివ్యత్వంపై ఇట్టి సందేహాలు మనకు కూడా కలుగుతూనే ఉంటాయి. కనుక మనం దేహాభిమానమును వీడి దైవాభిమానమును పెంచుకోవాలి, ఏకాత్మభావమును విశ్వసించాలి. కాని అందరూ ఇంతటి పవిత్రస్థితికి పోలేరు. ఒక్క గోపికలు మాత్రమే ఇట్టి ఏకాత్మభావాన్ని అనుసరిస్తూ వచ్చారు.

## వెన్నవంటి హృదయం గోపికలది

ఒకానొక సమయంలో కృష్ణుడు ఉద్ధవుని ద్వారా గోపికల కొక సందేశం పంపించాడు. ఉద్ధవుడు, ''గోపికలారా! కృష్ణుని సందేశం వినడానికి రండి'' అన్నాడు. అప్పుడు గోపికలు, ''ఉద్ధవా! మా హృదయంలో కృష్ణుని ప్రేమభావములు నిండి యున్నాయి. మా భావము కృష్ణునిలో లీనమై ఉంటున్నది. ఈ సందేశం వినడానికి మాకు ఇంకొక భావము లేదు. కనుక నీవు వచ్చిన దారి పట్టుకొని తిరిగి కృష్ణునివద్దకే వెళ్ళు'' అన్నారు. వారొకనాడు బృందావనంలో కృష్ణునితో ఆడుకుంటున్న సమయంలో ఉన్నట్లుండి కృష్ణుడు అంతర్థానమయ్యాడు. ఇంత గోపికలు ప్రతి మొక్క దగ్గరకు, ప్రతి పూవు దగ్గరకు పోయి అడుగుతున్నారు:

*'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై*
*జల్లెడువాడు మౌళి పరిసర్పిత పింఛమువాడు నవ్వు రా*
*జిల్లెడు మోమువాడొకడు మా సర్వము దోచుకవచ్చెనో*
*మల్లియలార మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే!'*

కృష్ణుడు లేని స్థానము, కృష్ణుడు కాని రూపము లేదని విశ్వసించారు గోపికలు. వారి హృదయం వెన్నవలె మెత్తనైనది, పవిత్రమైనది, మధురమైనది, ఆనంద మయమైనది. కనుకనే కృష్ణుడు వారి హృదయాలను అపహరించాడు. ఒకనాడు యశోద కృష్ణుణ్ణి పట్టుకొని, "కృష్ణా! వెన్న నేను పెడితే తినవుకాని గోపికల ఇళ్ళకు పోయి వెన్న దొంగిలించి తింటున్నావు. మన ఇంటి వెన్న నీ కిష్టం లేదా? పరుల ఇంటి వెన్న నీ కంత రుచిగా ఉందా?" అని నిలదీసింది. దీని అంతరార్థ మేమిటి? కృష్ణుడు దొంగిలించినది వెన్న కాదు. నిర్మలమైన గోపికల హృదయాన్ని దొంగి లించాడు. గోపికలకు దేహాభిమానం లేదు.

"అత్తలు మొత్తుకొన్న మరి భర్తలు కత్తులు
నూరుచున్న నోరెత్తరు, కోపగించరు,
ఎరుకేగరు, భీతిలబోరు గోపికల్
పొత్తములందు చిత్తరువు రీతిగ నుండె
వారిలో కృష్ణుడు..."

కాని యశోదకు మాత్రం దేహాభిమాన మున్నది. "వీడు నా కుమారుడు, నేను కృష్ణునికి తల్లిని" అనే అహంకార మమకారములు కూడా ఉన్నవి. అహంకారమే మానవునికి మహాశత్రువు. కనుక మీరు అహంకారమునకు అవకాశ మివ్వకూడదు, మమ కారమును పెంచుకోకూడదు.

## పరమాత్మకు తృప్తి నిచ్చేది పరిపూర్ణమైన అర్పణ

ఇటలీ దేశంలో ఆంథోనీ అనే మహాభక్తు డుండేవాడు. అతడు వయోలిన్‌లను తయారుచేసి వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో జీవితాన్ని గడిపేవాడు. అయితే ఒక్క వయోలిన్ తయారు చేయడానికతనికి ఒక సంవత్సరం పట్టేది. ఒక పర్యాయం అతని మిత్రులు వచ్చి, "ఆంథోనీ! నీవు ఒక్క వయోలిన్ తయారు చేయడానికి ఒక సంవత్సరం తీసుకుంటే నీ కుటుంబాన్ని ఏరీతిగా పోషించగలవు?" అని కోపగించుకున్నారు. ఆంథోనీ ఏమాత్రం బాధపడక, "మై డియర్ ఫ్రెండ్స్! భగవంతుడు పరిపూర్ణుడు. కనుక భగవంతునికి తృప్తి కలగాలంటే మనం ఏ పని చేసినా, ఏ మాట చెప్పినా అంతా పరిపూర్ణంగా ఉండాలి. కనుక నేను తయారు చేసే ప్రతి వయోలిన్ కూడా పరిపూర్ణమైనదిగా ఉన్నప్పుడే భగవంతునికి తృప్తి కలుగుతుంది. భగవంతునికి తృప్తి కల్గినప్పుడే నాకు కూడా తృప్తి కల్గుతుంది. భగవంతుని ఆనందమే నాకు ప్రధానం. ఈ ప్రాకృతానందములు క్షణిక మైనవి" అన్నాడు. పరిపూర్ణుడైన పరమాత్మను సంతృప్తి పర్చాలంటే పరిపూర్ణమైన అర్పణ కావాలి. "నాకు అది కావాలి, ఇది కావాలి" అని భగవంతుని లౌకికమైన కోరికలు కోరరాదు. లేక ఏదో జబ్బు నివారణ చేయమని ప్రార్థించరాదు. ఎందుకంటే ప్రపంచమంతా జబ్బులతో నిండియున్నది. అందరి దగ్గరున్న జబ్బు నీ దగ్గర కూడా ఉన్నది. ప్రపంచ మంతా ధనముతోను, భవనములతోను, సర్వసౌఖ్య ములతోను కూడియుంటున్నది. వీటికోసం నీవు తిరిగి దైవాన్నెందుకు ప్రార్థించాలి! నీ దగ్గర లేని దేదో దానికోసం ప్రార్థించు. నీ దగ్గర లేని దేది? శాంతి లేదు, ఆనందం లేదు. అవి దైవం దగ్గర మాత్రమే ఉన్నవి. అట్టి శాంతికోసం, ఆనందంకోసం నీవు భగవంతుని ప్రార్థించాలి. అవి వేరొకరు ఇచ్చేవి కాదు, వాటిని భగవంతుడే ఇవ్వాలి. శాంతికి, ఆనందానికి భగవంతుడే అధిపతి.

## ఆత్మతో సంబంధమే ఆధ్యాత్మికం

ప్రతి భక్తునికి భగవంతునిపై విశ్వాసం కలిగి నప్పుడు దాని నీడవలె అవిశ్వాసం కూడా వెంట తగులుతుంది. కొందరు దైవాన్ని ఒక క్షణంలో పూర్తిగా విశ్వసిస్తారు, మరుక్షణంలోనే దానికి విరుద్ధంగా ప్రవర్తిస్తారు. ఏ పరిస్థితిలోనైనా స్థిరంగా నిలిచేవారు ఏ కొద్దిమందో ఉంటారు. అట్టి స్థిరభక్తిని, స్థిరబుద్ధిని

మీరు కల్గియున్నప్పుడే మీకు దివ్యత్వం అర్థమవుతుంది. గంగానదిలో జలమెంతగానో ప్రవహిస్తున్నప్పటికీ మీ పాత్ర ఎంతనో నీరు అంతనే చిక్కుతుంది కదా! కనుక దైవత్వాన్ని గుర్తించాలంటే ముందు హృదయ మనే పాత్రను విశాలం గావించుకోవాలి. పూజల వల్ల, వ్రతములవల్ల, జపతపధ్యానములవల్ల దైవత్వాన్ని మీరు గుర్తించలేరు. ఇవన్నీ మంచి పనులు. వీటికి తగిన ఫలితం మీకు చిక్కుతుంది. కాని ఇది ఆధ్యాత్మికం కాదు. ఆత్మతో సంబంధమే నిజమైన ఆధ్యాత్మికం. దానిని వదలి మీరు జపమో, తపమో చేస్తే - ఇవి తాత్కాలికమైనవి కనుక వీటివల్ల మీకు తాత్కాలిక ఫలితములే లభిస్తాయి. ఆత్మ ఒక్కటే సత్యనిత్యమైనది. అట్టి ఆత్మను స్మరించినప్పుడే మీకు సత్యనిత్యమైన ఫలితములు చేకూరుతాయి.

### భజనలు అందరికీ ఆనందం కల్గించేవిగా ఉండాలి

మీరు భజనలు చేస్తున్నారు; ఎన్ని రాగాలనో మార్చుతున్నారుకాని, భావాన్ని ఏమైనా మార్చు కుంటున్నారా? లోపల చూస్తే మృగలక్షణం, బయట చూస్తే నామస్మరణం - ఇటువంటి భజనలు ఎందు కోసం?! భావము మారినప్పుడే భజన చేసి నందుకు సార్థకత ఉంటుంది. మీరు చేసే భజనలు కేవలం బాహ్యమైన రాగతాళములతో చేరుతున్నాయే కాని, హృదయంతో చేరటం లేదు. ఇలాంటి భజనలను మీరు ఎన్ని సంవత్సరాలు చేసినా టేపురికార్డర్‌కు లభించిన ఫలితమే మీకు లభిస్తుంది. కనుక భజనలు చేసేవారు ముందు తమ భావములను మార్చుకోవాలి. దుష్టభావములు దూరం కావాలి, పవిత్రమైన భావములు రావాలి. భజనలో అనేకమంది పాల్గొంటారు. కాబట్టి లీడ్ చేసేవాళ్ళు సమావేశమును, సమయసందర్భమును పురస్కరించుకొని అందరికీ ఆనందం కలిగించే పాటలు పాడాలి. అట్లుగాకుండా నాకిష్టమైన పాటలనే నేను పాడతానంటే - అసలు అలాంటి పాట లెందుకు పాడాలి?! ఇది స్వార్థం. స్వార్థం, స్వార్థం! స్వార్థంకోసం పాడేవాళ్ళు తమ రూమ్‌లో కూర్చుని పాడుకోవాలికాని, పబ్లిక్‌లో కాదు. భజన లీడ్ చేసేవాళ్ళు కేవలం తమ ఇష్టమును, తమ శ్రుతిలయరాగములను మాత్రమే చూసుకుంటే సరిపోదు. "ఇన్నివేలమంది ఉన్నారిక్కడ! నా పాట వీరందరి హృదయాలను ఆనందంతో నింపుతుందా?" అని విచారణ చేయాలి. సామూహిక భజనను గురు నానక్ ప్రారంభించాడు. అందరూ చేరి ఒకే భావంతో పాడాలి. అంతేగాని నీ పాటికి నీవు ఇష్టమొచ్చినట్లు పాడుకుంటూ పోతే ఎవరికోసం పాడినట్లు? నీ కోసమే నీవు పాడినట్లుగాని, భగవంతునికోసం కాదు.

### ప్రేమకే పరమాత్ముడు వశుడౌతాడు

ప్రతి సత్కర్మకు ప్రేమయే ప్రాణసమానమైన దివ్యశక్తి. అది లేనప్పుడు పాడి ప్రయోజనమేమిటి? చేసి ప్రయోజనమేమిటి? చూసి ప్రయోజనమేమిటి? చెప్పి ప్రయోజనమేమిటి? భగవంతుడు ప్రేమకు మాత్రమే వశుడవుతాడు. కబీర్‌దాసు కూడా, "రామా! నేను జపధ్యానములు చేయలేను, యజ్ఞయాగముల నాచరించలేను. కాని నిన్ను కట్టివేయగల ప్రేమ సూత్రము మాత్రం నా దగ్గరున్నది. అంతే చాలు!" అన్నాడు. ప్రేమలేని హృదయం మరుభూమివంటిది. అందుకోసమే గోపికలు చెప్పారు:

"ప్రేమరహిత మరుభూములలో<br>
ప్రేమాంకురములు పెంపొంద<br>
ప్రేమావేశముతో ప్రేమ సుధా వర్షము వర్షింపగ<br>
ప్రేమ నదులు ప్రవహింపగ మురళీ గానము సేయగదే<br>
కృష్ణా! గానము సేయగదే!"

"వేదసారమంత తీసి నాదబ్రహ్మముగను మార్చి<br>
వేణువందు తిరుగబోసి గానరూపముగను మార్చి<br>
పాటపాడుమా కృష్ణా! పలుకు తేనెలొలుకు నటుల<br>
మాటలాడుమా ముకుంద మనసు తీరగా"

మన దేహం నవరంధ్రములతో కూడిన మురళివంటిది. ఇందులో విషయవాంఛలేవీ అడ్డు రాకూడదు. అప్పుడే భగవంతుడు దీనిపై సుస్వరములను పలికించి ఆనందము నొలికిస్తాడు. గోపికలు తమ దేహమునే మురళిగా చేసుకొని గానం చేయమని ప్రార్థించారు కృష్ణుణ్ణి. వారి హృదయాలు అంత పవిత్రమైనవి. నేడు కూడా భక్తిశ్రద్ధలు కల్గినవారు లేకపోలేదు. అయితే భక్తితోపాటు హృదయంలో దివ్యమైన భావములను కూడా చేర్చుకోవాలి. ఏదైనా పర్వదినం వచ్చినప్పుడు మాత్రం హృదయంలో పవిత్రమైన భావములు ఆవిర్భవించి రెండవ దినమే అవి మటుమాయమైపోతే ప్రయోజనమేమిటి?! ప్రతి దినము, ప్రతి క్షణము పవిత్రమైనదిగా భావించాలి. ఇట్టి భావనచేతనే దివ్యత్వాన్ని పొందడానికి వీలవుతుంది.

## మానవుడనగా విశ్వాసం కలవాడు

భగవంతుడు లేని స్థానం లేదు. కాని నీవు చూడలేకపోతున్నావు. నీవు మనిషిరూపాన్ని మాత్రం చూస్తున్నావుకాని, మనిషిలోని మాధవుని చూడలేకపోతున్నావు. మాధవత్వమే లేక మనిషి ఎలా నిలువగలడు? గాలి కంటికి కనిపించదు, చేతికి చిక్కదు. అంతమాత్రమున అది లేదంటావా? అట్లాగే దైవము నీ చుట్టూ ఉన్నాడుకాని, కంటికి కనిపించడు; చేతికి చిక్కడు; నిర్మలమైన హృదయం, పవిత్రమైన భావం కల్గినవానికే దక్కుతాడు. ఏ భావం పవిత్రమైనది? ఏకాత్మభావమే పవిత్రమైనది. ఏకాత్మభావం కల్గినవాడే నిజమైన సాధువు. అంతేగాని కాషాయవస్త్రాలు ధరించినవా రందరూ సాధువులే ననుకోవడం పొరపాటు. గుడ్డలు మారితే సరిపోదు, గుణము మారాలి. మానవుడనగా విశ్వాసం కలవాడని అర్థం. ఏ విశ్వాసం? దైవవిశ్వాసం కావాలి. నీవు చాకలివాణ్ణి నమ్మి అతనికి నీ విలువైన బట్టలు వేస్తున్నావు, మంగలివాణ్ణి నమ్మి అతని ముందు నీ తల వంచుతున్నావు, కంసాలిని నమ్మి అతని చేతికి బంగారమిస్తున్నావు, డ్రైవరును నమ్మి కారులో కూర్చుంటున్నావు. ఈవిధంగా అందరినీ నమ్ముతున్నావుకాని దైవాన్ని నమ్మటం లేదు. ఇదే పెద్ద బలహీనత. నమ్మవలసింది భగవంతు డొక్కడినే. మిగిలినవారిని నమ్మినా నమ్మకపోయినా ఫరవాలేదు. మహనీయుల చరిత్రలను చక్కగా విచారించి చూస్తే భగవంతుడే వారిని అన్ని విధములుగా సంరక్షిస్తూ వచ్చాడని తెలుస్తున్నది కదా! వారు అనేక కష్టములకు గురి అయినప్పటికీ దైవవిశ్వాసాన్ని కోల్పోనందువల్లనే ఈనాటికీ జగత్తులో కీర్తిమర్యాదల నందుకోగల్గుతున్నారు. అయితే పరమభక్తులు కూడా ఒక్కొక్క సమయంలో బాధలకు ఓర్వలేక భగవంతుని నిందిస్తుంటారు. కాని అది క్షణికావేశమే!

## రామదాసు - త్యాగరాజు

మీకు తెలుసు - రామదాసు ప్రభుత్వానికి కట్టవలసిన డబ్బుతో రామాలయం కట్టించాడని తానీషా అతనిని జైల్లో పెట్టించాడు. రామదాసు ఒంటరిగా ఉన్నాడు జైల్లో పాపం! "నేనేం పాపం చేశాను? డబ్బునేమీ దుర్వినియోగం చేయలేదే! సీతారామలక్ష్మణులకు ఆభరణాలు చేయించాను, మందిరం కట్టించాను. ఇందులో తప్పేమున్నది?!" అని చాల విచారించాడు. తాను ఇంతగా కష్టపడుతున్నా రాముడు కనికరించట్లేదని కోపం వచ్చింది.

*'సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా!*
*ఆ పతకమునకు పట్టె పదివేలవరహాలు రామచంద్రా!*
*కలికితురాయి మెలుకుగ చేయిస్తి రామచంద్రా!*
*నీవు కులుకుచు తిరిగెదవు ఎవరబ్బ సొమ్మని రామచంద్రా!'*

"రామచంద్రా! నేను చేయించిన ఆభరణాలను పెట్టుకొని కులుకుతూ తిరుగుతున్నావే! ఎవడబ్బ సొమ్మనుకుంటున్నావు?" అని ప్రశ్నించాడు. తక్షణమే తన తప్పును తెలుసుకున్నాడు.

'అబ్బా! తిట్టితినని ఆయాస పడవద్దు రామచంద్రా!
ఈ దెబ్బలకోర్వక అబ్బా! తిట్టితినయ్యా రామచంద్రా!'

''ఈ బాధను తాళలేక నిన్ను తిట్టాను స్వామీ! నన్ను క్షమించు'' అని కోరాడు. త్యాగరాజు కూడా అంతే! తన అన్న పెట్టే కష్టాలను భరించుకోలేక ఒకనాడు అతనికి కూడా రామునిపై కోపం వచ్చింది. ''రామా! నాలో భక్తి లేదా? లేక నీలో నన్ను కాపాడగల శక్తి లేదా?'' అని ప్రశ్నించాడు. తక్షణమే తన పొరపాటును గుర్తించి, ''రామా! నీలోనే శక్తి లేకపోతే కోతి యైన హనుమంతుడు సముద్రాన్ని దాటగలడా? సాక్షాత్తు లక్ష్మీదేవియైన సీత నిన్ను వరిస్తుందా? మహా పరాక్రమవంతుడైన లక్ష్మణుడు నిన్ను సేవిస్తాడా? సూక్ష్మబుద్ధిగల భరతుడు నిన్ను పూజిస్తాడా? అబ్బ! నీ శక్తి చాల గొప్పది రామా!'' అని కీర్తించాడు. దేహాభిమానంవల్లనే భగవంతునిపై సందేహాలు కలుగుతుంటాయి. అయితే పరమభక్తులైనవారికి ఇవి కదలిపోయే మేఘములవలె అప్పటికప్పుడు వచ్చి పోతుంటాయి; ఏదీ పర్మనెంట్‌గా ఉండదు.

### దైవదూషణకు పాల్పడకండి

శ్రీమన్నారాయణుని ద్వారపాలకులైన జయ విజయులు శాపవశాత్తు భూలోకంలో పుట్టవలసి వచ్చింది. ''స్వామీ! నిన్ను వదలి మేము ఒక్క క్షణమైనా ఉండలేము. కరుణించి మమ్మల్ని శాప విముక్తులను చేయండి'' అని ప్రార్థించారు. అప్పుడు నారాయణుడు, ''జయవిజయులారా! మీరీ శాప ఫలితాన్ని అనుభవించక తప్పదు. అయితే నా భక్తులుగా ఏడు జన్మలెత్తి వస్తారా? లేక నా ద్వేషులుగా మూడు జన్మలెత్తి వస్తారా? మీరే నిర్ణయించుకోండి'' అన్నాడు. శ్రీమన్నారాయణుని సన్నిధికి ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా తిరిగి రావాలనే తపనతో వారు హరి ద్వేషులుగా మూడు జన్మలెత్తి వస్తామన్నారు. కనుకనే వారు రాక్షసులుగా పుట్టి నిరంతరము హరిని ద్వేషిస్తూ వచ్చారు; చివరికి హరి చేతిలోనే మరణం పొంది హరిని చేరుకున్నారు. వారు పరమభక్తులు. శ్రీమన్నారాయణుని ఎక్కువకాలం వదలి ఉండలేక అటువంటి కోర్కె కోరారుకాని, మీరు మాత్రం దైవదూషణకు పాల్పడకండి. దూషణవల్ల దైవసన్నిధి లభించదు. ప్రేమతో దైవాన్ని స్మరించండి.

### అవతారము లెందుకు వస్తాయి?

దివ్యమైన ప్రేమతత్త్వమును ప్రపంచానికి చాటే నిమిత్తమై భగవంతుడు అప్పుడప్పుడు అవతరిస్తుంటాడు. దైవాన్ని ఏ రీతిగా మన వశం చేసుకోవాలనే విషయాన్ని బోధించడానికే అవతారములు వస్తుంటాయి. పూలు, సూది, దారం ఉన్నాయి. కాని పుష్పమాల తానగునా? కూర్చేవాడొకడుండాలి కదా! ప్రమిద, నూనె, వత్తి కలవు. కాని దీపపు వెలుగు కలుగునా? ముట్టించేవాడొకడుండాలి కదా! బంగారు, రత్నములున్నాయి. కాని సొమ్ములు నిర్మాణమగునా? చేసేవాడొకడుండాలి కదా! అట్లాగే విద్య కలదు, బుద్ధి కలదు. కాని జ్ఞానసిద్ధి కలుగునా? బోధించేవా డొకడుండాలి కదా! కనుక మానవుడు దైవమును చేరే మార్గమును బోధించే నిమిత్తమై దైవమే మానవాకారము ధరించి అవతరిస్తుంటాడు. కనుక ఎందుకు అవతారము వచ్చిందంటే ఏమీ పని లేక కాదు, ప్రకృతిని సార్థకం గావించే నిమిత్తమై వచ్చింది. దుర్లభమైన మానవజన్మను సార్థకం గావించుకోవడానికి తగిన మార్గమును బోధించే నిమిత్తమై వచ్చింది. పశువులు పంటను చూస్తే ముందు దాంట్లో పడి త్వరత్వరగా తినేస్తాయి; తరువాత తమ స్వస్థానమునకు పోయి చక్కగా నెమరు వేసుకొని జీర్ణించుకుంటాయి. అట్లాగే మీ రిక్కడ స్వామిబోధలను త్వరత్వరగా వింటున్నారు. విన్నవి మరచిపోకండి; మీ స్వస్థానం చేరిన తరువాత వీటిని మననం చేసి ఆచరణలో పెట్టండి. ఆచరణే ప్రధానం.

(తేది:**25.8.97**న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశం నుండి)

# మానవుడు సర్వశక్తిమయుడు

"సత్యం మాతా పితాజ్ఞానం ధర్మోభ్రాతా దయా సఖా
శాంతం పత్నీ క్షమా పుత్రః షడేతే జన బాంధవాః"

ప్రేమస్వరూపులారా!

ఈ జగత్తులో భౌతిక శరీరమునకు, ప్రాకృతమైన అనిత్యమైన ఈ జీవితమునకు ప్రాకృతమైన అనిత్యమైన తల్లిదండ్రులే ప్రాప్తిస్తుంటారు. కాని నివృత్తి మార్గంలో విచారణ సల్పినప్పుడు మనకు నిజమైన బంధువులు ఎవరనేది పై శ్లోకం చక్కగా వివరిస్తుంది. సత్యము త్రికాలాబాధ్యమైనది, మార్పు చెందనిది. అట్టి సత్యమే శాశ్వతమైన తల్లి. జ్ఞానమే తండ్రి. ఎట్టి జ్ఞానము? భౌతిక జ్ఞానమా? శాస్త్రజ్ఞానమా? కాదు, కాదు. 'అద్వైత దర్శనం జ్ఞానం', ఏకత్వాన్ని ప్రబోధించే జ్ఞానమే నిజమైన తండ్రి. ధర్మమే సోదరుడు, దయయే మిత్రుడు. అసురుడైనా, భూసురుడైనా, అఖండ తెలివి కలవాడైనా దయచేతనే ధన్యత పొందాలి. ఇంక శాంతమే పత్ని, క్షమయే పుత్రుడు. ఈ లోకంలో పుత్రులేదో మనను ఉద్ధరిస్తారని భావిస్తుంటాము. మన నుద్ధరించేది ఈ లౌకికమైన పుత్రులు కాదు, అందరినీ ఉద్ధరించువాడు ఉత్తముడైన దైవమే. సత్యము, ధర్మము, శాంతము, దయ ఇవన్నీ దైవస్వరూపాలే. దీనిని పురస్కరించుకొనియే,

"త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ"

అని భగవంతుని ప్రార్థిస్తున్నాము. ఈ జగత్తంతయు భగవంతుని స్వరూపమే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ప్రతి అణువునందు, ప్రతి కణమునందు ఉన్నది బ్రహ్మయే. పర్వతములు, వృక్షములు, పారాడే పురుగులు, తినే తిండి, త్రాగే నీరు, పీల్చే గాలి, ఎగిరే పక్షులు సర్వమూ బ్రహ్మ స్వరూపమే.

"చుక్కలన్నియు బ్రహ్మ, సూర్యుండు అది బ్రహ్మ
చంద్రుడన్నను బ్రహ్మ, జలము బ్రహ్మ
స్వర్గమన్నను బ్రహ్మ, వైకుంఠమది బ్రహ్మ
తల్లియన్నను బ్రహ్మ, మరి తండ్రి బ్రహ్మ
భాగ్యమన్నను బ్రహ్మ, వాల్లభ్యమది బ్రహ్మ
జీవరాసులు బ్రహ్మ, జీవి బ్రహ్మ
పుట్టించునది బ్రహ్మ, పోషించునది బ్రహ్మ
గిట్టించునది బ్రహ్మ, గృహిణి బ్రహ్మ
కర్మలన్నియు బ్రహ్మ, కాలంబు బ్రహ్మ
ప్రకృతంతయు బ్రహ్మ, మన ప్రేమ బ్రహ్మ
సర్వమును బ్రహ్మ, ఈ సభయు బ్రహ్మ
సత్యమును దెల్పునట్టి ఈ సాయి బ్రహ్మ"

**మానవునిలోని అజ్ఞాత శక్తులు**

భగవంతుడు, ప్రకృతి, జీవుడు - ఈ మూడూ బ్రహ్మతత్వములే. జీవుడు, దేవుడు వేరు కాదు. జగత్తు, జగదీశ్వరుడు వేరు కాదు. "సర్వం విష్ణుమయం జగత్." కనుక భగవంతుని అన్వేషించుటకు ఎట్టి సాధనలూ చేయనక్కరలేదు. భగవంతుడు శక్తిమయుడు. ఆ శక్తి యొక్క ప్రతిబింబమే ప్రకృతి. ప్రకృతిలోని సమస్త శక్తులూ ప్రకృతిలో జీవించే ప్రతి మానవునియందును ఉన్నవి. కాని అవి అజ్ఞాతమైన స్థితిలో నున్నవి. అజ్ఞాతమనగా తెలియని స్థితి.

పాండవులు పదకొండేళ్ళు అరణ్యవాసము, ఒక యేడు అజ్ఞాతవాసము చేశారని విన్నాము కదా! అజ్ఞాతవాసమనగా ఎవ్వరికీ తెలియకుండా జీవించటం. అటులనే సమస్త శక్తులూ మానవునియందు అజ్ఞాతవాసము చేస్తున్నాయి. మానవుడు ఈ సత్యాన్ని గుర్తించుకోలేక తాను శక్తిహీనుడనని భ్రమిస్తున్నాడు. ఇది చాల పొరపాటు. మానవ దేహము నఖ శిఖ పర్యంతము ఖనిజ శక్తితో కూడియున్నది. చింతపండు, ఆపిల్, బత్తాయి, నిమ్మరసములవల్ల ఏర్పడే ఆమ్లము ఈ ఖనిజశక్తితో చేరినప్పుడు విద్యుచ్ఛక్తి ప్రారంభమవుతుంది. కనుక మానవ దేహమొక చిన్న జనరేటర్‌వంటిది. అంతేకాదు. మానవునిలో ప్రవేశించిన భావములు నోటిద్వారా వెలువడు తున్నాయి కదా! కాబట్టి మానవుడొక రేడియోవంటివాడు కూడా. ఇంక తాను పూర్వము దర్శించిన ప్రతి పదార్థమును తలుచుకుంటే మళ్ళీ చూడగల్గుతున్నాడు. ఇదే మానవునిలో ఉన్న టీవీ! కాబట్టి విద్యుచ్ఛక్తి, ఆకర్షణశక్తి, రేడియో, టీవీ అన్నీ మానవునిలోనే ఉన్నాయి.

### అతీతశక్తియే ఆత్మశక్తి, దైవశక్తి

సైంటిస్టులు అంతా అణుమయ మన్నారు; వేదాంతులు అంతా బ్రహ్మమయ మన్నారు. పేర్లు వేరుకాని రెండూ ఒక్కటే. శక్తియే బ్రహ్మ, బ్రహ్మయే శక్తి. ఈ జగత్తునందు శక్తి సర్వత్ర వ్యాపించియున్నది. ఈనాడు మనకు జీవత్వముగాను, పదార్థముగాను గోచరించేవి కడపటికి శక్తిగానే మారిపోతాయి. వైజ్ఞానికులు జగత్తులో ఎనర్జీ, మేటర్ (శక్తి, పదార్థము) రెండూ ఉన్నాయంటారు. కాని మేటర్ అనేదే లేదు, అంతా ఎనర్జీయే. ఈ జగత్తంతా శక్తిమయమే. శక్తి అనగా కంటికి కనిపించునది కాదు. శక్తి శక్తియే. ఇదే దైవత్వము. జగత్తులోని కాంతిశక్తి, విద్యుచ్ఛక్తి, ఉష్ణశక్తి మున్నగునవన్నీ మనిషియందు కూడా ఉన్నాయి. అయితే ఈ సమస్త శక్తులకు ఏదో ఒకటి ఆధారంగా ఉండాలి కదా! అదే దివ్యత్వము. (టేబుల్‌పైనున్న టంబ్లర్‌ను చూపిస్తూ) ఈ టంబ్లర్ నిలవడానికి ఆధారం టేబుల్, ఈ టేబుల్ నిలవడానికి ఆధారం భూమి. అదేవిధంగా సమస్త శక్తులకు మూలాధారం దివ్యత్వము. దీనినే వేదాంతులు అతీతశక్తి అనీ, వైజ్ఞానికులు, సూపర్‌పవర్ అనీ పిలుస్తూ వచ్చారు. దీనిని ఎట్లా తెలుసుకోవడానికి వీలవుతుంది? మానసికశక్తి, ధారణా శక్తి, ధ్యానశక్తి, సమాధిశక్తి - ఈ నాల్గింటి ద్వారా అంతర్గతమైన ఆత్మశక్తిని గుర్తించడానికి వీలవుతుంది.

### అణువు, ఆత్మ, బ్రహ్మ మూడూ ఒక్కటే

దైవశక్తి ఒకరు పుట్టించేది కాదు, ఒకరు నాశనం చేసేది కాదు. ఇది అవినాశి. అయితే ఒక శక్తిని మరొకశక్తిగా మార్చడానికి వీలవుతుంది. అయస్కాంత శక్తిని విద్యుచ్ఛక్తిగాను, విద్యుచ్ఛక్తిని కాంతిశక్తిగాను మార్చవచ్చునుగాని అసలు శక్తి అనేదే లేకుండా చేయుటకు వీలుకాదు. అట్టి మార్పుచెందని శక్తియే దైవత్వము. కనుక దైవత్వమును నిర్మూలించుటకు ఎవ్వరికీ చేతకాదు. ప్రతి అణువునందు ప్రతి కణమునందు దైవత్వము నిండియున్నది.

"సూక్ష్మమైనట్టి అణువున సూక్ష్మమగుచు
మేటి వస్తువునందున సదా మేటి యగుచు
అంతటను సర్వసాక్షియై అలరు నట్టి
ఆత్మయే అణువు, అణువే బ్రహ్మయగును"

బ్రహ్మ, అణువు, ఆత్మ మూడూ ఒక్కటే. ఇవి దైవత్వానికి పర్యాయపదములు మాత్రమే. సర్వత్ర ఉన్నది అణుతత్వమే అని తెలుసుకోవడానికి సైంటిస్టులకు వేయి సంవత్సరాలు పట్టింది. వీరు ఏదో చిన్న ఆవగింజంత తెలుసుకొని గుమ్మడికాయంత అహంకార

పడుతున్నారు. కాని, ఈ సత్యాన్ని కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే బాలుడైన ప్రహ్లాదుడు గుర్తించి,

''ఇందుగలడందు లేడని
సందేహము వలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకి జూచిన
నందందే గలడు......'' అన్నాడు.

### దేహాభిమానం గలవానికే భయం

ఏకత్వాన్ని గుర్తించడంచేతనే ప్రహ్లాదుడు దేహాభిమానమును మరచి దైవత్వంలో లీనమయ్యాడు. అతనికి దేహాభిమానమే గనుక ఉంటే రాక్షసులు అతనిని పర్వతముల నుండి క్రిందికి త్రోసే సమయంలో, ''అయ్యో! క్రిందపడిపోతానేమో'' అని భయపడియుండేవాడు. కాని అతనికా భయమే లేదు. ''నారాయణ, నారాయణ'' అని చిరునవ్వులు చిందిస్తూనే ఉన్నాడు. విషసర్పములు అతని చేతిలో పూలమాలలైపోయినాయి. అతని గురువులు హిరణ్యకశిపునివద్దకు వచ్చి చెబుతున్నారు: ''అయ్యా! ఏమిటీ బిడ్డ యొక్క మహాత్మ్యము! ఇతనికి కించిత్తైనా దేహాభిమానం లేదు.''

''తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటి కో పన్నగశాయి! యోదనుజభంజన! యో జగదీశ! యో మహా పన్న శరణ్య! యో నిఖిల పావన! యనుచు నుతించెగాని తా కన్నుల నీరు తేడు, భయకంపసమేతుడు కాడు భూవరా!''

అనగా దైవత్వాన్ని గుర్తించిన వ్యక్తికి నిరంతరము ఆనందమే తప్ప విచారమనేదే ఉండదు. దేహాభిమానం గలవారే కష్టనష్టములకు క్రుంగిపోతుంటారు. మనస్సున్నంత వరకు విచారములు తప్పవు. మనస్సున్నంత వరకు దైవత్వాన్ని గుర్తించలేము. కనుక అమనస్కులం కావాలి. అమనస్కస్థితి వచ్చినప్పుడే దేహాభిమానం పోతుంది. దేహాభిమానం పోయినప్పుడే సమాధిస్థితి ప్రాప్తిస్తుంది. లాభనష్టములను, సుఖదుఃఖములను, పాపపుణ్యములను రెండింటినీ సమానంగా చూసుకోవడమే సమాధి. దీనివల్లనే అతీతమైన శక్తులు మన నుండి ఆవిర్భవిస్తాయి.

### దైవాభిమానంతోనే ఫలసిద్ధి

అనేకమంది, ''మేము భగవంతునిలో చేరిపోవాలి, మేము మోక్షం పొందాలి'' అని ఆశిస్తున్నారు. కాని ఇది ఎట్లా సాధ్యమవుతుంది? భగవంతుడు రూపరహితుడు, శక్తిమయుడు. ''శబ్ద బ్రహ్మమయీ, చరాచరమయీ, జ్యోతిర్మయీ, వాఙ్మయీ, నిత్యానందమయీ, పరాత్పరమయీ, మాయామయీ, శ్రీమయీ'' ఈ అష్టశక్తులతో కూడిన దైవత్వంలో మనం ఏరీతిగా చేరడానికి వీలవుతుంది? నీరు నీరుతో చేరగలదు, గాలి గాలితో చేరగలదు. అదేవిధంగా, రూపరహితుడైన భగవంతుని చేరాలంటే మనం కూడా రూపరహితులం కావాలి. అనగా దేహాభిమానమును వీడాలి. దీనినే 'ధ్యానము' అన్నారు. దేనిలో మనం ఏకం కావాలని ఆశిస్తున్నామో దాని స్వరూపాన్ని పొందాలి. దేహాభిమానమును వీడక దైవాన్ని ప్రార్థిస్తే ఫలసిద్ధి కలుగదు. మనది జీవనజ్యోతి, అది పరంజ్యోతి. ఆ పరంజ్యోతి నుండి వచ్చినదే ఈ జీవనజ్యోతి. కనుక తిరిగి ఆ పరంజ్యోతిలోనే ఈ జీవనజ్యోతి లీనం కావాలి. దేహాభిమానమును వీడినప్పుడే ఇది సాధ్యమౌతుంది. దీపావళినాడు ఒక్క క్రొవ్వొత్తి సహాయంతో అనేక జ్యోతులను వెలిగిస్తాము. ఏకంగా ఉన్న క్రొవ్వొత్తియే పరంజ్యోతి, మిగిలినవన్నీ జీవనజ్యోతులు. అదేవిధంగా దైవమనే పరంజ్యోతి నుండియే అనేక జీవనజ్యోతులు ఏర్పడ్డాయి. కనుక మనను మన మొక జీవనజ్యోతిగా భావించుకొని ఏకాగ్రతతో ధ్యానించి, పరంజ్యోతిలో లీనం కావాలి.

## సత్కర్మలు ద్వైతం, ఆధ్యాత్మికం అద్వైతం

ఇంకొక విషయాన్ని మీకు చెబుతున్నాను. మీరు భజనలు చేస్తున్నారు, జపతపధ్యానములు సల్పుతున్నారు, యజ్ఞయాగాదుల నాచరిస్తున్నారు. ఇవన్నీ ప్రాకృతమైన ప్రవృత్తి మార్గములేకాని నివృత్తి మార్గములు కాదు. ఇవన్నీ సత్కర్మలేకాని ఆధ్యాత్మికమునకు సంబంధించినవి కాదు. ఆధ్యాత్మిక మనగా ఆత్మకు సంబంధించినది. అయితే మీరు ఎట్టి కర్మలు చేస్తారో అట్టి ఫలితము మీకు తప్పక ప్రాప్తిస్తుంది. అనగా సత్కర్మలవల్ల మీరు సత్కర్మలకు సంబంధించిన ఫలితం మాత్రమే ఉంటుంది. కాని, ఆత్మకు సంబంధించిన ఫలితము రాదు. కనుక మొదట సత్కర్మలతో ప్రారంభించి క్రమేణ ఆత్మసంబంధమైన మార్గంలో ప్రవేశించాలి. ఎంతకాలమైనా ఇంకా సత్కర్మలలోనే ఉంటే ఇంక ఆత్మతత్వాన్ని గుర్తించే దెప్పుడు? సత్కర్మలన్నీ ద్వైతంతో కూడినవి. కనుక ద్వైతం నుండి అద్వైతంలోకి ప్రవేశించాలి. అప్పుడే జ్ఞానం ప్రాప్తిస్తుంది.

## ప్రేమయే అద్భుత ఆకర్షణశక్తి

ఇనుప ముక్కలను ఆకర్షించేది మాత్రమే అయస్కాంతశక్తి అని పిల్లలు భావిస్తారు. ఇది చాల పొరపాటు. ప్రపంచంలో ఉన్నదంతా అయస్కాంత శక్తియే! పచ్చగడ్డిని చూపితే పశువు పరుగెత్తి వస్తుంది. బిడ్డను చూస్తే తల్లి ఆప్యాయంగా ఎత్తుకుంటుంది. ఇదంతా అయస్కాంతశక్తి ప్రభావమే! భార్యాభర్తల మధ్య, పుష్పమునకు తుమ్మెదకు మధ్య ఉన్నది అయస్కాంతశక్తియే! ''రమయతీతి రామః'' సర్వులను ఆకర్షించేవాడే రాముడు. ఆత్మయే అన్నింటినీ ఆకర్షిస్తుంది. ఈనాడు ఇంతమంది ఇక్కడకు వచ్చారంటే ఈ ఆకర్షణయే దీనికి మూలకారణం. సహజమైన పుష్పముపై తుమ్మెదలు ఎక్కడెక్కడి నుండో వచ్చి వ్రాలుతుంటాయి. అదే ప్లాస్టిక్ పుష్పమైతే ఒక్క తుమ్మెద కూడా దానిపై వ్రాలదు - కారణం? దానిలో మకరందం లేదు గనుక. ఆ మకరందమే ప్రేమ. ప్రేమయే సర్వులను ఆకర్షిస్తుంది. ప్రేమయే పవర్‌ఫుల్ మేగ్నెట్! ఈ ఆకర్షణశక్తి ప్రపంచమంతా నిండియున్నది. మానవుడు ప్రపంచంలో ఉన్నవాడు గనుక ఇది మానవునిలోను ప్రవేశించింది. తల్లిదండ్రుల రూపు పుత్రుడు పొందినట్లుగా జగత్తు నుండి ఆవిర్భవించిన మానవుడు జగత్స్వరూపమునే పొందుతాడు. ఈశ్వరేచ్ఛను ప్రకటనయే ప్రకృతి. కనుక ప్రకృతియందు పుట్టిన ప్రతి మానవునికి ఈశ్వరభావమే రావాలి. ఈశ్వరత్వాన్ని ప్రకటించే నిమిత్తమై మూర్తీభవించినవాడే మానవుడు.

## వ్యాసపూర్ణిమ

అనంతమైన వేదములను నాలుగు వేదములుగా విభజించి లోకానికి అందించినవాడు వ్యాసుడు. ''వ్యాసో నారాయణో హరిః'' అన్నారు. అనగా అతడు నారాయణస్వరూపుడే! ప్రపంచమునకు పవిత్రమైన వేదమాతను అందించాను కదా అని వ్యాసుడు సంపూర్ణంగా సంతృప్తిపడిన దినమే ఈ వ్యాసపూర్ణిమ. ఇది గురుపూర్ణిమ కాదు. పూర్ణిమనాడు చంద్రుడు పరిపూర్ణంగా ఉంటాడు. వేదము, ''చంద్రమా మనసో జాతః'' అన్నది. మనస్సు, చంద్రుడు బింబప్రతిబింబములే. కనుక మన మనస్సు కూడా ఎట్టి దోషములూ లేకుండా పరిపూర్ణంగా ఉండాలి. ''మర్మమెఱిగిన మరు నిమిషంలో మనస్సే వారికి గురుడండీ!'' అన్నారు. ఏనాడు జీవిత మర్మమును తెలుసుకుంటామో ఆనాడు మన మనస్సే మనకు గురువవుతుంది.

## దైవమే నిజగురువు

మీరు వేరుగా భావించకూడదుకాని, ఈనాటి ప్రాకృత గురువులు చేసే బోధలచేత మానవత్వములోని దివ్యత్వము మరింత అడుగున

పడిపోతున్నది. గురువు అనే పదమునకు అర్థమును మీరు తెలుసుకోవాలి. కేవలం బోధించువాడు కాదు గురువు, మంత్రము నుపదేశించువాడు కాదు గురువు. గుకారము గుణాతీత తత్వమును, రుకారము రూపరహిత తత్త్వమును సూచిస్తాయి. గుణము, రూపము లేనివాడు ఒక్క దైవమే. కనుకనే, ''గురు ర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః'' అన్నారు. నిజమైన గురువు దైవ మొక్కడే. మిగిలినవారందరూ కేవలం టీచర్స్ మాత్రమే. విద్యార్థికి ఒక్కొక్క సబ్జెక్ట్‌కి ఒక్కొక్క టీచర్ ఉంటాడు. ఇంతమందిని ఎట్లా పూజించడానికి వీలవుతుంది? వీరంతా అధ్యాపకులు మాత్రమేకాని గురువులు కారు. గురువంటే గురిని చూపించేవాడని అర్థం. గురి అనగా ఏమిటి? అదే ఆత్మతత్త్వము. తనను తాను తెలుసుకున్నవాడే నిజమైన గురువు. ఆచరించి ప్రబోధించేవాడే ఆచార్యుడు.

### *లౌకిక గురువుల కుయుక్తులు*

కృతయుగంలో బలిచక్రవర్తి వామనుడు సాక్షాత్ నారాయణుడేనని తెలుసుకొని అతనికి తన సర్వస్వమును అర్పించడానికి సిద్ధమైనప్పుడు శుక్రాచార్యుడు వద్దని అడ్డుకున్నాడు. దైవానికి సర్వస్వం అర్పితం చేస్తుంటే వద్దని చెప్పేవాడు గురువేనా? కాదు, కాదు. ద్వాపరయుగంలో ద్రోణాచార్యుడు అర్జునుని కొక ప్రామిస్ చేశాడు. ''నా శక్తినంతా నీకే ధారపోస్తాను. ప్రపంచంలో నిన్ను మించిన విలుకాడు లేకుండా చేస్తాను'' అన్నాడు. ఒకనాడు ఏకలవ్యుడు వచ్చి తనకు విలువిద్య నేర్పమని ప్రార్థించాడు. ద్రోణాచార్యుడు తాను అర్జునునికి తప్ప మరొకరికి గురువుగా ఉండదల్చుకోలేదని చెప్పి నిరాకరించాడు. అంతవరకు బాగానే ఉంది. అయితే ఒకసారి పాండవులు విహారార్థమై అరణ్యానికి వెళ్ళారు. వారివెంట కొన్ని వేటకుక్కలను కూడా తీసుకొని వెళ్ళారు. అక్కడొక మృగమును చూసి ఒక కుక్క గట్టిగా అరిచింది. తక్షణమే ఎక్కడి నుండో నాలుగైదు అంబులు ఒక్కతూరి వచ్చి కుక్కను నేలకూల్చాయి. ''ఈ శక్తి నాకు కూడా లేదే! ఇంతటి గొప్ప విలుకాడు ఎవరైయుంటారబ్బా!'' అని అర్జునుడు ఆశ్చర్యపడి అరణ్యంలో వెతుకుతూ పోయాడు. ఒక పూరి గుడిసెవద్ద ఏకలవ్యుడు ధనుర్బాణములతో కనిపించాడు. అర్జునుడు, ''నీవేనా ఇప్పుడు అంబులను వదలినది?'' అని ప్రశ్నించగా అతడు అవునన్నాడు. ''ఎవరు నీ గురువు?'' అని ప్రశ్నించాడు అర్జునుడు. ద్రోణాచార్యుడు తనను శిష్యునిగా స్వీకరించక పోవడంచేత అతని ప్రతిమనే తన గురువుగా భావించుకొని ఏకలవ్యుడు విలువిద్యలో ప్రావీణ్యత గడించాడు. అందుచేత ద్రోణాచార్యుడే తన గురువని సమాధాన మిచ్చాడు. అర్జునుడు అసూయతో మండి పడ్డాడు. ద్రోణాచార్యుడు మాట తప్పాడని కోపంగా ఇంటికి వెళ్ళాడు. ద్రోణాచార్యుడు మాత్రం సత్యమే చెప్పాడు. ''నేను ఆ ఏకలవ్యునికి గురువును కాదు. అతడు నా దగ్గరకు వచ్చి విలువిద్య నేర్పమని ప్రార్థించినమాట నిజమేకాని, నేను అంగీకరించ లేదు'' అన్నాడు. కాని అర్జునుడు మాత్రం తనను మించిన విలుకాడు ఈ లోకంలో ఉండకూడదనీ, ఎట్లాగైనా ఏకలవ్యుని విలువిద్యను నిర్వీర్యం గావించాలనీ పట్టుపట్టాడు. ఇంక విధి లేక, రాజకుమారునికి విరుద్ధంగా పోతే తన గతి ఏమవుతుందోనని భయపడి ద్రోణాచార్యుడు ఒక కుయుక్తి పన్నాడు. అరణ్యంలో నివసిస్తున్న ఏకలవ్యునివద్దకు పోయి, ''ఏకలవ్యా! ఎవరు నీ గురువు?'' అని అడిగాడు. ఏకలవ్యుడు ఎంతో గౌరవంగా, ''స్వామీ! నీవే నా గురువు'' అన్నాడు. అయితే నాకు గురుదక్షిణ ఏమిస్తావని అడిగాడు. ఏదడిగితే అదిస్తానన్నాడు ఏకలవ్యుడు. అన్నింటికీ అతడు సిద్ధమే! ఎందుకంటే గురువుపై అతనికి అంతటి విశ్వాసం! అట్టివానికి గురువు చాల ద్రోహం చేశాడు.

''దక్షిణాంగుష్ఠ మిచ్చిన దానజేసి
బాణసంధాన లాఘవ భంగమయిన
నెఱుకు విలువిద్య కలిమికి హీనుడయ్యె
బార్థునకు మనోరుజయును బాసె నంత''

అర్జునుణ్ణి తృప్తి పర్చడానికి ఏకలవ్యునియొక్క దక్షిణాంగుష్ఠమును దక్షిణగా కోరాడు ద్రోణాచార్యుడు. ఇది గురువు చేసే పనియేనా? కాదు, కాదు. ఇలాంటి ప్రాపంచిక గురువులు శిష్యులను తమ స్వార్థస్వప్రయోజనములకు వినియోగించుకొని ఆత్మజ్ఞానమునకు దూరం చేస్తున్నారు. వీరందరూ వ్యావహారికమైన గురువులేకాని ఆత్మసంబంధమైన గురువులు కాదు. మీరు ఎవరివద్దనైనా విద్యను నేర్చుకోవచ్చు, తప్పులేదు. కాని మీ జీవితం భగవంతునికి మాత్రమే అర్పితం కావాలి. అదే నిజమైన భక్తి, అదే నిజమైన ఆధ్యాత్మికం.

## దైవం హృదయస్థాయి

దైవత్వాన్ని నీ దేహమునందే పెట్టుకొని ఎక్కడో వెదకబోవడ మేమిటి! నీ ఇంటనే పంచభక్ష్య పరమాన్నము లుండగా పొరుగింటికి పోయి పాచిపోయిన పప్పు అడుగుతావా? ''ఇంటిలోనె జ్యోతి వెలుగుచునుండగా పరుల ఇంటికి అగ్గికి అరుగనేల?'' ఆ పరంజ్యోతి, ఆ ఆత్మజ్యోతి, ఆ అద్వైతజ్యోతి, ఆ ఆనందజ్యోతి నీయందే ఉన్నది. కనుక నీవు దేనికీ వెరువనక్కర లేదు.

''హెచ్చుగ సంపద లొచ్చినగానీ
ఏనుగు గుఱ్ఱము లెక్కినగానీ
పిచ్చోడని పేరొచ్చినగానీ
ప్రీతిగ పెద్దలు పొగడినగానీ
దైవము మరువకురా
నరుడా! నామము విడువకురా!''

ఇంతకంటే మించిన ధ్యానం లేదు. భగవంతుడు నా హృదయంలోనే ఉన్నాడనుకుంటే ఎంత ఆనందం! దీనిలోని ఆనందం ఇంక దేంట్లోను లేదు. నాయందే భగవంతు డున్నాడనుకుంటే నీవు ఏ తప్పులూ చేయవు, ఎవ్వరికీ భయపడవు. నీ కాన్షియన్సే నీకు గైడెన్స్ ఇస్తుంది. అందరినీ ప్రేమించు, అందరిలోను దైవమున్నాడని విశ్వసించు. ఫోటోను దైవంగా పూజించుకాని దైవాన్ని ఫోటోగా భావించకు. నీ హృదయాన్ని మాత్రం మరువవద్దు, దైవము అక్కడే ఉన్నాడు.

## జ్ఞానచక్షువుతో చూడాలి

ప్రతి పదార్థమూ అణుమయమే. ప్రతి అణువూ దైవస్వరూపమే. ప్రతి అణువుకు రూపముంది. అయితే అది కంటికి కనిపించదు మైక్రోస్కోప్‌తో చూసినప్పుడు మాత్రమే కనిపిస్తుంది. అదేవిధంగా భగవంతుడు కూడా చర్మచక్షువులకు కనిపించడు, జ్ఞాన చక్షువుకు మాత్రమే కనిపిస్తాడు. చర్మచక్షువులకు కేవలం బాహ్యప్రపంచం మాత్రమే గోచరిస్తుంది. జ్ఞానచక్షువుతో చూసినప్పుడు, ''అరే, నేనెంత పిచ్చివాడను! నేనే దైవమైయుండగా ఎందుకిన్ని పిచ్చి ఆటలాడాను?'' అని సిగ్గు పడతావు. త్రాగినవాడు మత్తులో ఏమేమో చేస్తుంటాడు; ఏమి చేస్తున్నాడో తనకే తెలియదు. మత్తు వదలిన తరువాత తాను చేసిన పని తెలుసుకొని, ''అయ్యో! నేనిట్లా చేశానా!'' అని సిగ్గుపడతాడు. అదేవిధంగా నీవు జగత్సంబంధమైన విషయవాసనలలో మునిగినంత వరకు త్రాగినవానివలె నీవేమి చేస్తున్నావో నీకే తెలియదు. విషయవాసనల నుండి విశ్వేశ్వర తత్త్వంలో ప్రవేశించినప్పుడే నీ నిజతత్త్వం నీకు అర్థమవుతుంది.

(తేది:*20.7.1997*న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

# త్యాగం లేని దేశభక్తి, ప్రేమ లేని దైవభక్తి నిరర్థకం

"విద్య మానవునికి మూడవ నేత్రమువంటిది. సత్యము ననుసరించడమే నిజమైన తపస్సు. రాగమే దుఃఖము, త్యాగమే సుఖము"

ప్రేమస్వరూపులైన విద్యార్థులారా! మీరు కేవలం మేధాశక్తిని మాత్రమే అభివృద్ధి పర్చుకుంటే చాలదు, దానితోపాటు హృదయాన్ని కూడా విశాలం చేసుకోవాలి. విద్య హృదయ వికాసము నందించాలి, హృదయపవిత్రతను చేకూర్చాలి; మానవుణ్ణి ఆదర్శ మానవునిగా, పరిపూర్ణమానవునిగా తీర్చిదిద్దాలి. విద్య విజ్ఞానంకోసమేకాని ఉద్యోగంకోసం కాదు. అయితే ఉద్యోగం చేసుకోవటంలో తప్పు లేదు. కాని విద్య ఉద్యోగం కోసమని భ్రమించడం మాత్రం తప్పు. విద్య అనేది వ్యక్తికి, సమాజానికి, దేశానికి, ఉపయోగకరమైనదిగా ఉండాలి. ఒకానొక సమయంలో ఒక వ్యక్తి గాంధీ నుద్దేశించి, "గాంధీజీ! ఈ ప్రపంచంలో మీకు అమితంగా బాధ కలిగిస్తున్న విషయమేమైనా ఉన్నదా?" అని ప్రశ్నించాడు. "ఉన్నది, మానవుణ్ణి కఠినహృదయునిగా మార్చివేస్తున్న ఆధునిక విద్యయే నాకు అమితంగా బాధ కలిగిస్తున్నది" అని చెప్పాడు గాంధీ.

ఈనాటి సైంటిస్టులు పంచభూతముల రహస్యములను కనిపెట్టి తద్వారా వాటితో ఊడిగం చేయించుకొంటూ ఏదో ఘనకార్యం సాధించామని విఱ్ఱవీగుతున్నారు. ఇది చాల ప్రమాదకరమైన విషయం. **Man has conquered all but he has not conquered himself** అని ఒకానొక సమయంలో చర్చిల్ కూడా చెప్పాడు. మానవుడు అన్నింటినీ తెలుసుకోగల్గుతున్నాడుకాని, తనను తాను తెలుసుకోలేకపోతున్నాడు. తనను తాను తెలుసుకోలేనివాడు ఎన్ని తెలుసుకొని ఏమి ప్రయోజనం?! ఒక వ్యక్తి ఒక గదిలో ప్రవేశించి దేని గురించో వెతుకుతున్నాడు. అతడికి ఆ గదిలోని వస్తువులన్నీ కనిపిస్తున్నాయికాని, తనకు తాను కనిపించడం లేదు. అటులనే మానవుడు ఈ ప్రపంచమనే గదిలో ప్రవేశించి లౌకికమైన దృశ్యాలను మాత్రమే చూస్తున్నాడుకాని తనను తాను చూసుకోవడం లేదు. తనను తాను తెలుసుకున్నప్పుడే మానవునికి అన్నీ సులభంగా సమకూరుతాయనే రహస్యాన్ని విద్యార్థులుగాని, అధ్యాపకులుగాని గుర్తించడం లేదు.

### ఆధ్యాత్మికవిద్య అత్యవసరం

ఈనాడు సమాజంలో తల్లిదండ్రులుగాని, అధ్యాపకులుగాని, రాజకీయ నాయకులుగాని తగిన ఆదర్శాన్ని నిరూపించలేకపోవడంచేతనే విద్యార్థులు పెడమార్గం పడుతున్నారు. అధ్యాపకులు విద్యార్థులకు కేవలం పుస్తక పరిచయం మాత్రమే గావించి అంతటితో తమ బాధ్యత తీరిపోయిందని భావిస్తున్నారు. ఇది చాల పొరపాటు. నిత్య జీవితానికి అవసరమయ్యే ప్రతి విషయాన్ని విద్యార్థులకు బోధించాలి. తాము అమితమైన జీతాలను తీసుకుంటూ పిల్లలకు అల్పమైన విద్యలు బోధిస్తే వారి గతి ఏమి కావాలి?! దివ్యత్వమును తెలిపే విద్యయే సరియైన విద్య. "కుంభినీధవు చెప్పెడి గురుడు గురుడు, తండ్రిహరి జేరుమనియెడి తండ్రి తండ్రి, చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు"

అన్నాడు ప్రహ్లాదుడు. ఈవిధమైన చదువు నేర్చుకుంటే మా పొట్టలు నిండే దెట్లా? అని సందేహిస్తారు కొంతమంది. ఈ భౌతికమైన జీవితానికి తగిన భౌతికమైన విద్యలను మీరు నేర్చుకోవలసిందే! అయితే ఇవన్నీ ఆత్మజ్ఞానంపైనే ఆధారపడియున్నవనే సత్యాన్ని మాత్రం గుర్తించాలి. ఒక్క ఆత్మజ్ఞానమును గుర్తిస్తే సమస్త జ్ఞానములూ మనకు కరతలామలకము లౌతాయి. కనుక అధ్యాపకులు లౌకికవిద్యతోపాటు ఆధ్యాత్మిక విద్యను కూడా పిల్లలకు బోధించాలి. తద్వారా అధ్యాపకులు బాగుపడతారు, పిల్లలు కూడా బాగుపడతారు. అధ్యాపకుడే బీడీలు త్రాగుతూ పిల్లలకు త్రాగకూడదని చెబితే వాళ్ళు వింటారా? వినరు. కనుక అధ్యాపకులు పిల్లలకు ఏమి బోధించినా ముందు తాము ఆచరించి చూపించాలి. విద్యార్థులను తమ స్వంత బిడ్డలుగా భావించి వారి చదువుపట్ల తగిన శ్రద్ధ చూపించాలి.

### దుర్గుణత్యాగమే అమృతత్వానికి మార్గం

సాత్వికమైన గోవులు నివసించే షెడ్‌లోనికి పులులు, నక్కలు ప్రవేశిస్తే గోవుల గతి ఏమవుతుంది? అటులనే మన హృదయంలో కామక్రోధలోభమోహ మదమాత్సర్యములనే పులులు, తోడేళ్ళు ప్రవేశిస్తే ఇందులో సత్యధర్మశాంతిప్రేమఅహింసలనే సాధు జంతువు లేమైనా జీవించగలవా? కనుక ముందు మనలో దుర్గుణములు ప్రవేశించకుండా చూసుకోవాలి. అందువల్లనే నేను అప్పుడప్పుడు చెబుతుంటాను: ''వాట్ ఈజ్ ది వే టు ఇమ్మోర్టాలిటీ? రిమూవల్ ఆఫ్ ఇమ్మొరాలిటీ ఈజ్ ది ఓన్లీ వే టు ఇమ్మోర్టాలిటీ'' అనగా దుర్గుణ త్యాగమే అమృతత్వానికి మార్గం. త్యాగమయమైన దేశభక్తి, ప్రేమమయమైన దైవభక్తి – ఈ రెండే మన జీవిత తత్వాన్ని అభివృద్ధి పరుస్తాయి. త్యాగరహితమైన దేశభక్తి, ప్రేమ రహితమైన దైవభక్తి నిరర్థకం.

### దైవాజ్ఞ ననుసరిస్తేనే క్షేమం కల్గుతుంది

ఎట్టి పరిస్థితిలోనైనా దైవాజ్ఞను మనం అనుసరిస్తూనే ఉండాలి. అప్పుడే మనం సుక్షేమంగా మన జీవన గమ్యం చేరగలము. ఒక తండ్రి తన బిడ్డలను తీసుకొని రైలులో ప్రయాణమై వెళుతున్నాడు. పిల్లలందరికీ తాను టికెట్లు కొన్నాడుగాని, వాటిని పిల్లల చేతికివ్వలేదు. ఆ టికెట్లను తన దగ్గరే ఉంచుకొని, ''నేనెక్కడ దిగుతానో మీరు కూడా అక్కడే దిగండి. మిగిలినది నేను చూసుకుంటాను'' అని వారితో చెప్పాడు. కొంతదూరం పోయేటప్పటికి, ''నాన్న ఇంకా దిగలేదే! మేమెక్కడ దిగేది? ఎక్కడ దిగేది?'' అని పిల్లలలో అలజడి బయలుదేరింది. వారిలో స్టేషన్‌లలో కనిపించే తినుబండారాలను, ఆటవస్తువులను చూస్తుంటే వీరికి క్రిందికి దిగాలనే ఆశ ఎక్కువవుతూ ఉన్నది. కాని తండ్రి మాత్రం, ''ఇది సమయం కాదు. ఎక్కడ దిగాలో నేను చెబుతాను, అప్పుడు దిగవచ్చు'' అన్నాడు. ఎంతసేపయినప్పటికీ తండ్రి దిగటం లేదు. దానితో పిల్లలకు విసుగు పుట్టింది. ''తండ్రి దిగకపోతే పోనీలే, మనం దిగిపోదాం'' అన్నాడు ఒకడు. కాని టికెట్లు తండ్రి దగ్గర ఉన్నాయి, అవి లేకుండా దిగితే స్టేషన్‌వారు పట్టుకుంటారన్నాడు మరొకడు. దీనివల్ల వారిలో ఒకవిధమైన భయమేర్పడింది. ఏమిటీ కథ యొక్క అంతరార్థం? మీరందరూ జీవితమనే రైలులో ప్రయాణమై వెళుతున్నారు. ఈ ప్రపంచంలో ఎవరు ఎప్పుడు ఎక్కడ దిగాలో ఆప్రకారంగా తండ్రియైన భగవంతుడు టికెట్లు తీసుకున్నాడు. ''మన టికెట్లు తండ్రి దగ్గరున్నాయి. కనుక మనం దేనికీ భయపడనక్కరలేదు. ఏ టికెట్ కలెక్టర్ వచ్చినా మనకు భయం లేదు'' అనే ధైర్యాన్ని, విశ్వాసాన్ని మనం కల్గియుండాలి. తండ్రి ఎప్పుడు దిగుతాడో, ఏమి చెబుతాడో దానిని హృదయపూర్వకంగా అనుసరించాలి. అప్పుడే

సుక్షేమం చేకూరుతుంది. అట్లుగాక నీవు తండ్రిఆజ్ఞను ధిక్కరించి మధ్యలో ఏదైనా స్టేషన్‌లో దిగిపోతే ఆ తరువాత నీ గతి అధోగతే!

## దేహంపైనున్న రిటర్న్ తేది దైవానికే తెలుస్తుంది

గూడ్సురైలుపెట్టెల మీద 'రిటర్న్' తేది ఒకటి ఉంటుంది. ఆ తేది వచ్చేసరికి ఆ పెట్టెలు వెనక్కి వెళ్ళిపోతాయి. ఈ దేహాలు కూడా గూడ్సురైలుపెట్టెల వంటివే. ఈ పెట్టెలను మనం అనేక విషయవాసనలతో నింపుకున్నాము. అయితే ఈ పెట్టెలపై వ్రాయబడిన రిటర్న్ తేది మనకు తెలియదు. అది ఒక్క భగవంతుడనే స్టేషన్ మాస్టర్‌కు మాత్రమే తెలుస్తుంది. ఆ తేది వచ్చేటప్పటికి వీటిని తక్షణమే వెనక్కి పంపిస్తాడు. కనుక మరణం తప్పదు; దానికోసం ఎప్పుడూ సంసిద్ధంగానే ఉండాలి. పరమాత్మునిపై పవిత్రమైన ప్రేమను పెంచుకోవాలి. అప్పుడు ఎక్కడికి పోయినా ఏ భయం లేదు. ''అడవులందున్న, ఆకసముననున్న, పట్టణముననున్న, పల్లెనున్న, గుట్టమీదనున్న, నట్టేటబడియున్న...'' ఎక్కడు న్నప్పటికీ భగవంతుడు మిమ్మల్ని రక్షిస్తూనే ఉంటాడు.

## దేహాన్ని మరచి దైవాన్ని ప్రార్థించాలి

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి కొండలపైనుండి నెట్టించాడు, సముద్రంలో పడద్రోయించాడు, పాములతో కరిపించాడు, ఏనుగులతో త్రొక్కించాడు. ప్రతి పర్యాయము ఆ పిల్లవానిని భగవంతుడే రక్షించుకున్నాడు. ఎందుచేత? అతడు దేహాభి మానమును వీడి పరిపూర్ణమైన దైవాభిమానంతో ఉండటంచేత దైవమే అతనిని రక్షించాడు. ''అయ్యో! నన్ను గుట్టపైనుండి నెట్టుతున్నారే!'' అన్న దేహాభిమానమే అతనిలో ఉంటే భగవంతుడు కూడా రక్షించేవాడు కాదు. సముద్రంలో పడద్రోసే సమయంలోను, గుట్టపై నుండి నెట్టే సమయంలోను, పాములతో కరిపించే సమయంలోను, ఏనుగులతో త్రొక్కించే సమయంలోను అతడు, ''ఓం నమో నారాయణాయ'' అని స్మరిస్తూనే ఉన్నాడు; దేహాన్ని మరచి తన మనస్సును నారాయణునిపై లగ్నం చేశాడు. కనుక మీరు కూడా దేహాభిమానమును వీడి మీ మనస్సును భగవంతునిపై లగ్నంచేయండి. అప్పుడు మీ యోగక్షేమాలను భగవంతుడే చూసుకుంటాడు.

## సాయివిద్యాసంస్థ ప్రత్యేకత

విద్యార్థులారా! లౌకికవిద్యతోపాటు ఆధ్యాత్మిక విద్యను కూడా బోధించడమే మన ఇన్‌స్టిట్యూట్ యొక్క ప్రత్యేకత. లోకంలో ఎన్నో విశ్వవిద్యాలయాలుంటున్నాయి; వాటితో మనం పోల్చుకోనవసరం లేదు. మన మంచిని మనం అభివృద్ధి పర్చుకోవాలి. ఇక్కడి విద్యార్థులుగాని, అధ్యాపకులు గాని చిత్తశుద్ధి కలిగినవారై ఆదర్శప్రాయులుగా రూపొందాలి. మీ నరనరములందు, కణకణములందు ఆధ్యాత్మిక రక్తము ప్రవహించాలి. ఈ భౌతికవిద్యలను నేను ద్వేషించడం లేదు. కాని వీటితోపాటు ఆధ్యాత్మిక విద్యను కూడా మీరు నేర్చుకోవాలి. అధ్యాపకులు కూడా ఈ విషయంలో తగిన శ్రద్ధ వహించాలి. ఎప్పుడెప్పుడు క్లాసు అయిపోతుందా, ఎప్పుడెప్పుడు ఇంటికి పోదామా అనే ఆతృత ఉండకూడదు. అధ్యాపకులు, అధికారులు, విద్యార్థులు అన్యోన్య ప్రేమచేత, సహనభావంచేత, సానుభూతిచేత, ఐకమత్యంచేత ఈ సంస్థను పోషిస్తూరావాలి.

ఎవ్వరూ స్వామితత్వము నింతవరకు అర్థం చేసుకోలేదు. అనేకమంది స్వామినిగూర్చి ఉపన్యాసాలివ్వడంలో హీరోలుగా, స్వామిని అర్థం చేసుకోవడంలో జీరోలుగా కనిపిస్తున్నారు. టన్నులకొలది ఉపన్యాసాలిచ్చేబదులు ఒక ఔన్సు అర్థం చేసుకుంటే చాలు! ఎంతో దూరం నుండి వస్తున్న విదేశీయులు మాత్రం చక్కగా అర్థం

చేసుకుంటున్నారు. అయినప్పటికీ వారేమీ ఉపన్యాసా లివ్వటం లేదు. మీరు కూడా అర్థం చేసుకుంటే చాలు, ఉపన్యాసా లివ్వనక్కర లేదు; మీ ఆచరణే ఇతరులకు ఆదర్శంగా నిలుస్తుంది.

## సాయివిద్యాసంస్థ స్థాపనలో ముఖ్యోద్దేశ్యం

నా ప్రతి అణువు, ప్రతి రక్తబిందువు పిల్లలకే అర్పితం చేస్తున్నాను. కాని పిల్లలు, టీచర్లు, అధికారులు దీనిని అర్థం చేసుకోవడం లేదు. ఎందుకోసం ఈ ఇన్‌స్టిట్యూట్ ప్రారంభించాము? నాకు కావలసింది ఏముంటుంది? ఏది కావలసినా ఈ జగత్తులో అన్నీ నా స్వాధీనమే! అయితే పిల్లలు బాగుపడితే దేశం బాగుపడుతుంది. ఊరికే రమ్మంటే వారు రారు. కనుక వారికి విద్యను ఆశగా చూపించి, వారిని దగ్గరకు రప్పించుకొని తద్వారా వారిని సన్మార్గంలో ప్రవేశపెట్టాలనే ఉద్దేశ్యంతోనే ఈ విద్యాసంస్థను ప్రారంభించాము. భాగవతంలో దీనికొక చక్కని దృష్టాంత మున్నది. కృష్ణుడు చాల అల్లరి చేస్తున్నాడు, అతనిని పట్టుకోవడానికి యశోదకు సాధ్యం కావటం లేదు. అందువల్ల ఆమె ఒక ఉపాయం పన్నింది. కృష్ణునికి కనిపించకుండా కుడిచేతిలో కఱ్ఱ పట్టుకొని, ఎడమ చేతిలో వెన్న పెట్టుకొని, ''కృష్ణా! రా, వెన్న ఇదిగో'' అని చూపించింది. ఆ వెన్నను చూసి కృష్ణుడు దగ్గరకు రాగానే అతని చేయి పట్టుకుంది, కఱ్ఱ నుపయోగించింది. అట్లనే నేను కూడా పిల్లలకు విద్య అనే వెన్న చూపించి దగ్గరకు రప్పించుకొని ఆధ్యాత్మికమనే కఱ్ఱతో కొట్టి సరిచేస్తున్నాను. అంతేగాని ఈ ఇన్‌స్టిట్యూట్‌వల్ల నాకు వచ్చేది ఏమీ లేదు. విద్యార్థుల నుండి ఒక్క నయాపైసా నేను తీసుకోవటం లేదు. గవర్నమెంట్ నుండి అసలే తీసుకోవటం లేదు. గవర్నమెంట్ నుండిగాని, పబ్లిక్ నుండిగాని, విద్యార్థుల నుండిగాని ఒక్క నయాపైసా నేను ఆశించటం లేదు. అంతా నేనే పెట్టి చేయిస్తున్నాను. ''దిస్ ఈజ్ నాట్ బిజినెస్''. ఇదేమీ వ్యాపారం కాదు. నేను చేసే బిజినెస్ హృదయసంబంధమైనది, ప్రేమసంబంధ మైనది. ఈ సత్యాన్ని అందరూ గుర్తించాలి. ఈ విద్యాసంస్థయందు తర్ఫీదు పొందిన విద్యార్థులను అన్ని దేశములకు పంపించాలని నా ఉద్దేశ్యము. వీరిని చూసి అక్కడి విద్యార్థులు కూడా ఎంతైనా బాగుపడగలరు. పూర్వకాలంలో ఎప్పుడో ఒక్క వివేకానంద ఉండినాడని విన్నాము. కాని మన ఇన్‌స్టిట్యూట్‌లో అందరూ వివేకానందులే! అయితే వారికి తగిన ఉత్సాహప్రోత్సాహముల నివ్వాలి.

విద్యార్థులారా! ఉద్యోగాలకోసమై మీరు ప్రాకులాడకండి. మీ కాళ్ళపై మీరు నిలబడండి. ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోండి. దైవప్రేమను అభివృద్ధి చేసుకోండి. అమితంగా ధనమును సంపాదించడంలో సుఖ మేమీ లేదు. అయితే పరాధీనం కాకుండా మిమ్మల్ని మీరు పోషించుకునే శక్తిని సంపాదించుకోవాలి. మీ తల్లిదండ్రులు ఇంతవరకు మిమ్మల్ని పోషించారు. ఇకపై వృద్ధాప్యంలో వారిని పోషించడం మీ కర్తవ్యం. ఈ విషయాలను లక్ష్యమునందుంచుకొని మీ జీవితాలను పవిత్రంగా రూపొందించుకుంటారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

*(తేది:**31.7.97** ఉదయం ఇన్‌స్టిట్యూట్ ఆడిటోరియంలో శ్రీవారు విద్యార్థులకు, అధ్యాపకులకు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

ఓం

# త్రయీబృందావనంలో మరపురాని సాయంత్రాలు

బృందావనంలో భగవాన్ బాబావారి ఆగమనం కొరకు విద్యార్థులు చాతకపక్షులవలె ఎదురు చూస్తారంటే, అది అంత ఆశ్చర్యపడవలసిన విషయం కాదు. ఎందుచేతనంటే త్రయీ బృందావనంలో భగవాన్ బాబావారితో విద్యార్థులు గడిపే, శీలసంపదను పెంపొందించే, సాయంత్రాలు విద్యార్థులకు కేవలం స్ఫూర్తి నిచ్చేవి మాత్రమేగాక, మరపురాని మధురక్షణాలు కూడా. కళాత్మకమైన త్రయీబృందావన మందిరంలో భగవాన్ బాబావారు విద్యార్థులను, అధ్యాపకులను ఉద్దేశించి యథాలాపంగా చేసే ప్రసంగాలు అద్వితీయమైన మధురానుభూతిని కలిగిస్తాయి. సూటిగా, మనస్సుకు హత్తుకునేలా శ్రీవారు చేసే ప్రబోధాలు శ్రోతలలో అత్యున్నతమైన ఆధ్యాత్మిక చైతన్యమును కలిగిస్తాయి.

గత సంవత్సరంలోవలె గాక ఈ సంవత్సరం మార్చి, ఏప్రిల్ నెలలలో ఇంకా ఎక్కువ రోజులు అంటే, మార్చి 19వ తేది నుండి ఏప్రిల్ 17వతేది వరకు భగవాన్ బాబావారు బృందావనంలో గడపటంచేత, వారు చేసిన దివ్యప్రసంగాలు విస్తృతపరిధిలో అనేక విషయాలకు సంబంధించి ఉండటంచేత అక్కడి విద్యార్థులు, ఉపాధ్యాయులు కూడా ప్రత్యేకంగా అదృష్టవంతులని చెప్పాలి.

మొట్టమొదటి ప్రసంగంలో శ్రీవారు అనేక నీటిపారుదల, జలవిద్యుత్ పథకములు చేపట్టి మైసూరు రాష్ట్రం యొక్క సర్వతోముఖమైన పారిశ్రామికాభి వృద్ధికి దోహదం చేసి ఆ రాష్ట్రం యొక్క స్వరూపమునే మార్చివేసిన ప్రఖ్యాత ఇంజనీరు, పరిపాలనాదక్షుడు అయిన శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య గురించి చాలసేపు ప్రసంగించారు. అకుంఠితదీక్ష, ప్రజాసంక్షేమమునందు విశేషమైన భక్తిభావము కలకాలం నిలిచిపోయే ఆయన ఘనకార్యములకు దోహదం చేశాయని శ్రీవారు గుర్తు చేశారు.

మరొక రోజున శ్రీవారు తమ ప్రసంగంలో స్వాతంత్ర్యోద్యమంలో సుభాష్ చంద్రబోసు నిర్వహించిన పాత్రను గురించి, చిన్నతనంలో స్కూలులో చదువుకునే రోజుల నుండి ఆయన ప్రదర్శించిన ధైర్యసాహసాలను గురించి, ఆయన యొక్క అకుంఠిత దేశభక్తిని గురించి, చివరకు స్వాతంత్ర్యము సిద్ధించడానికి కొద్దికాలం ముందు దురదృష్టవశాత్తు ఆయన ఏవిధంగా అకాల మరణానికి గురయ్యారనే విషయాన్ని గురించి విద్యార్థులకు వివరించారు. విద్యార్థులు నిస్స్వార్థభావంతో దేశసేవకు అంకితం కావడానికి సుభాష్ చంద్రబోసువంటి ధైర్యసాహసములు గల జాతీయ నాయకుల జీవితాల నుండి స్ఫూర్తిని పొందాలని స్వామి ఉద్బోధించారు. నీతిబాహ్యమైన అధికారదాహం, పదవీకాంక్ష ఈనాడు దేశ రాజకీయవ్యవస్థను సమూలంగా నాశనం చేస్తున్న తీరుతెన్నులను స్వామి తీవ్రంగా నిరసించారు.

త్రికరణశుద్ధిని గురించి స్వామి ఈ ప్రసంగాలలో పదేపదే నొక్కి చెప్పారు. "మానవునికి శరీరము, మనస్సు, ఆత్మ అనే ఉపకరణములు ఉన్నాయి. మనస్సును, ఆత్మను విస్మరించి కేవలం శరీరముపైననే దృష్టి నిలిపితే మానవుడు మృగంగా మారిపోతాడు. ఆత్మను విస్మరించి శరీరమనస్సులకు ప్రాధాన్యత నిస్తే దానవుడైపోతాడు. ఇక శరీరము, మనస్సు, ఆత్మ - ఈ మూడింటికీ తగు ప్రాధాన్యత నిచ్చి అవి ఒకదాని కొకటి సహకరించేలా

చేయగలిగినప్పుడు మానవునిలో మానవత్వం ప్రస్ఫుటిస్తుంది. చివరిగా, శరీరమనస్సులపై ఆత్మ యొక్క ప్రభావం పడగలిగేలా సాధన చేయగలిగినప్పుడు మానవుడు దివ్యత్వమును పొందుతాడు'' అని ఒక ప్రసంగంలో స్వామి చెప్పారు.

హృదయ పవిత్రత యొక్క ఆవశ్యకతను గురించి నొక్కి చెపుతూ స్వామి, ''నీటిపైన వ్రాసిన వ్రాతలు వెంటనే చెరిగిపోతాయి; ఇసుకపై వ్రాసిన అక్షరాలు కొంతసేపు నిలిచి, గాలి వీచగానే చెదిరిపోతాయి; కాని, శిలలపై చెక్కిన అక్షరాలు శతాబ్దాల తరబడి అలాగే నిలిచి ఉంటాయి. అట్లే, శరీరమునకు మాత్రమే పరిమితమైన మాట వెంటనే నశించిపోతుంది; మనస్సుకు ఇచ్చిన మాట, మనస్సు మహాచంచలమైనది కావడంచేత, మరచిపోయే స్వభావం కలది కావడం చేత, కొంతకాలమే ఉంటుంది; కాని, వాక్కును గనుక హృదయంలో పదిలపరుస్తే అది చాలకాలం నిలిచి ఉంటుంది. దయగల హృదయమే దైవమందిరమని గుర్తుంచుకోండి'' అని చెప్పారు.

**సాయిరాముడు : హనుమంతుడు**

ఒక రోజు సాయంత్రం స్వామి తమ బాల్యస్మృతులను నెమరు వేసుకుంటూ ఇంతవరకు ఎవ్వరికీ వెల్లడించని ఒక సంఘటనను గురించి వివరిస్తూ ఇలా చెప్పారు:

''ఈ రోజు మీకు ఇంతవరకూ చెప్పని ఒక విషయం గురించి చెప్పాలనుకుంటున్నాను.

అప్పుడు నా వయస్సు ఎనిమిది సంవత్సరాలు. నేను అప్పుడు పుట్టపర్తిలో ఉన్నాను. నా వయస్సే ఉన్న చాలమంది కుర్రవాళ్ళు నా చుట్టూ ఎల్లప్పుడు ఉండేవారు. వారితోబాటు వయస్సులో మాకంటే కొంచెం పెద్ద పిల్లలు కూడా మాతో కలిసేవారు. వాళ్ళకు నేను చదవడం, వ్రాయడం, పాటలు పాడటం నేర్పేవాడిని. వాళ్ళు రోజూ స్నానం చేసేవారు కారు. అందుకని క్లాసుకు వచ్చేటప్పుడు మాత్రం తప్పకుండా స్నానం చేసి, పరిశుభ్రమైన బట్టలు ధరించి మరీ రావాలని నేను పట్టుబట్టేవాడిని.

ఒక పర్యాయం హనుమంతుని గుడి ప్రక్కన ఉన్న ఒక చెఱువు దగ్గరకు వాళ్ళను తీసికొని వెళ్ళాను. అందులో స్నానం చేసి, శుభ్రమైన బట్టలు ధరించి, హనుమంతుని రూపాన్ని హృదయంలో నిలుపుకుని, రామనామం జపిస్తూ ప్రక్కనే ఉన్న ఆంజనేయుని గుడి చుట్టూ ప్రదక్షిణ చేయమని వాళ్ళకు నేను చెప్పాను. కాని, వాళ్ళు నన్ను కూడా గుడిలోనికి రమ్మని బలవంతపెట్టారు. వాళ్ళతోబాటు నేను కూడా వెళ్ళి గుడిచుట్టూ సగం ప్రదక్షిణ చేశాక ఉన్నట్లుండి ఆగిపోయాను. నా చుట్టూ ఉన్న పిల్లలు నాతో ప్రదక్షిణ పూర్తి చేయించాలని గట్టిగా నన్ను పట్టి లాగసాగారు. వాళ్ళందరూ కలసి ఎంత ప్రయత్నించినప్పటికీ నిలబడినచోటు నుండి నన్ను కదల్చలేకపోయారు. ఎలాగైనా సరే, నాతో ప్రదక్షిణ పూర్తి చేయించాలనే పట్టుదలతో ఒక దృఢకాయుడు రెండు చేతులతో నన్ను ఎత్తుకొని ముందు అడుగు వేయబోయి వేయలేక ఆగిపోయాడు. వాళ్ళకి చాలా ఆశ్చర్యం వేసింది. అప్పుడు నేను వాళ్ళతో, ''హనుమంతుడు గుడిలోనుండి బయటికి వచ్చి శ్రీరామచంద్రుడు హనుమంతుని చుట్టూ ప్రదక్షిణ చేయకూడదు; హనుమంతుడే శ్రీరాముని చుట్టూ ప్రదక్షిణ చేయాలి అని చెపుతూ నన్ను గట్టిగా పట్టుకుని నిలిపివేశాడు. అందువల్లనే నేను ఇక్కడి నుండి కదలలేక పోతున్నాను'', అని చెప్పాను. అప్పుడు ఆ బాలురకు శ్రీరామచంద్రుని ముందు మోకరిల్లి నిలిచిన హనుమంతుని దివ్యదర్శనం లభించింది.

రాముడు ఎక్కడుంటే హనుమంతుడు అక్కడే అంజలి ఘటించి నిలిచి ఉంటాడని తెలుపుతూ రామాయణంలోని ఒక సంఘటనను స్వామి ఇలా వివరించారు:

రావణ సంహారం తరువాత అయోధ్యలో శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవం రోజున హనుమంతుడు తప్పించి ప్రతి ఒక్కరు రామచంద్రుని నుండి బహుమతులు అందుకోవడం సీత గమనించింది. ఇలా అందరికీ బహుమతులు ఇచ్చి హనుమంతుడొక్కనికే ఇవ్వకపోవడానికి కారణమేమని కొంచెం సేపయిన తరువాత సీత శ్రీరామచంద్రుని అడిగింది. అప్పుడు రాముడు, ''సీతా! హనుమంతునికి నాయందు గల అపారమైన భక్తికి సరితూగగల వస్తువు నాదగ్గర ఏముంది అతనికి బహుమతిగా ఇవ్వడానికి?! [illegible] నీ తండ్రియైన జనక మహా[illegible] [illegible]చ్చాడు. [illegible] గృహలక్ష్మి[illegible] [illegible] మూల్యమైన [illegible] మళ్ళీ నా [illegible] హనుమంతుడు. [illegible] మహాకార్యములు సాధించిన హనుమంతునికి నేను ఏ కానుకలు ఇవ్వగలను? హనుమంతుడు అనేక విధాల నాకు తండ్రివంటివాడని నువ్వు తెలుసుకోవాలి'', అని చెప్పాడు. శ్రీరామచంద్రుని నోటి నుండి హనుమంతుని గురించి ఇంతటి గొప్ప వాక్యములు వెలువడ్డాయి. ఒక అవతారపురుషుని నుండి భక్తునికి ఇంతకంటే గొప్ప ప్రశంస ఏముంటుంది?!

**వ్యసనానికి బానిసైన ఒక వ్యక్తిలో వచ్చిన మార్పు**

మరొకసారి స్వామి 60 సంవత్సరాల క్రితం తనతో కలిసి చదువుకున్న ఒక ముస్లిం బాలుని గురించి చెప్పారు. అతడు పెద్దయిన తరువాత చెడు సహవాసములు పట్టి మార్ఫియా అనే మత్తుమందును నిరంతరం సేవించే వ్యసనానికి లోనయ్యాడు. చివరకు, భగవాన్ బాబావారియందు అచంచలమైన భక్తి విశ్వాసములు పెంచుకుని, వాటి ప్రభావమువలన ఆ వ్యసనానికి దూరమై జీవితంలో ఒక గొప్ప మార్పును సాధించాడు.

ఆ రోజులను గుర్తు చేసుకుంటూ స్వామి ఇలా అన్నారు:

ఆ ముస్లిం బాలునికి ''రాజు'' (స్వామిని తోటివిద్యార్థులు అలా పిలిచేవారు) అంటే చాల ఇష్టం. స్వామి స్కూలును విడిచి పెట్టిన తరువాత ఆ ముస్లిం బాలుడు తన చదువును కొనసాగించి, తరువాత ఒక ఇన్సూరెన్సు కంపెనీలో పని చేశాడు. ఆ ఉద్యోగంలో అతడు బాగా సంపాదించాడు. అతనికి చాలమంది సంతానం కూడా కలిగారు. కాని, భార్య చనిపోయిన తరువాత అతడు తీవ్రమైన విచారంలో మునిగిపోయి తన బాధలను మరచిపోవడానికి మార్ఫియా ఇంజక్షన్లు తీసుకోవడం మొదలుపెట్టాడు. ఈ వ్యసనాల కయ్యే ఖర్చును తట్టుకోవడానికి తన ఆస్తినంతా అమ్మివేశాడు. ఫలితంగా కుటుంబమంతా కష్టాలపాలయింది. అప్పుడు తన తప్పును గుర్తించి ఈ మార్ఫియా వ్యసనాన్ని మానుకుందామని ప్రయత్నించాడు. కాని అతనికి సాధ్యం కాలేదు. ఇటువంటి పరిస్థితులలో ఒక అద్భుతమైన సంఘటన జరిగింది. ఒక రోజున అతడు సాయిభజన జరుగుతున్న ఒక భక్తుని ఇంటిముందు నుండి వెళ్ళడం తటస్థించింది. వెంటనే అతనికి చిన్నతనంలో తాను ''రాజు'' తో గడిపిన రోజులు జ్ఞప్తికి వచ్చి, భగవాన్ బాబావారు తనను ఈ విపత్కర పరిస్థితి నుండి తప్పించగలరని ఆశ కలిగింది. స్వామి యందు పరిపూర్ణ విశ్వాసంతో మూడు రోజులపాటు ఏది ఏమైనా తాను మార్ఫియా ఇంజక్షన్లు తీసుకోకుండా ఉండాలని నిశ్చయించుకున్నాడు. ఈలోపుగా స్వామి తనను ఈ వ్యసనం నుండి పూర్తిగా తప్పించగలరని విశ్వసించాడు. ''స్వామీ! మూడురోజుల తరువాత ఈ వ్యసనం బారినుండి

నన్ను నీవు తప్పించగలిగితే నీవు భగవంతుడవని విశ్వసిస్తాను. లేకపోతే ఆత్మహత్య చేసుకుంటాను'' అని ప్రతిజ్ఞ చేశాడు. చాలకాలము నుండి అలవాటయిన మార్ఫియా ఇంజక్షన్లు పూర్తిగా మానివేసి ఉండడానికి అతడు మూడురోజులపాటు నిద్రాహారాలు లేక విపరీతమైన వేదన ననుభవించాడు. అయినప్పటికీ తాను స్వామి కిచ్చిన మాటప్రకారం మార్ఫియా ముట్టలేదు. నాల్గవరోజు ఉదయం నిద్రలేచి తన పిల్లలను దగ్గరకు పిలిచి, ''బాబా నాకు కలలో కనిపించి నాతో మాట్లాడారు. నాకిప్పుడు చాల బాగుంది. నా శారీరక, మానసిక బాధలన్నీ తొలగిపోయాయి. నా దేవుడు నన్ను రక్షించాడు. సాయిబాబాయే నా దేవుడు'', అని చెప్పాడు.

ఆ క్షణం నుండి అతని జీవితం మారిపోయింది. అతనికి మళ్ళీ ఉద్యోగం దొరికి అతని ఆర్థిక పరిస్థితి మెరుగైంది. వ్యసనపరుడై అధోగతికి దిగజారి పోయిన ఒక వ్యక్తి భగవంతుని అనుగ్రహం వలన మళ్ళీ పైకి వచ్చి ఉత్తమమైన జీవితం గడుపడానికి అతని జీవితం ఒక నిదర్శనం. కొద్దిరోజుల క్రితం హైదరాబాదులో జరిగిన ఒక సమావేశంలో ఈ ముస్లిం, ''సాయిలో నా అల్లాను నేను చూడగలుగుతున్నాను. ఆయనే సర్వశక్తిమయుడైన నా దైవము'', అని ప్రకటించాడు.

**పండితుడు - పశువులకాపరి**

మరొక రోజున త్యాగముయొక్క విశిష్టతను, పరిపూర్ణ విశ్వాసమునకు గల శక్తిని గురించి భగవాన్ బాబావారు నొక్కి చెప్పారు. భగవంతునికి కావలసింది పాండిత్యము కాదనీ, కల్లాకపటం లేని భక్తికి, పరిపూర్ణమైన, అచంచలమైన విశ్వాసమునకే భగవంతుడు స్వాధీనమవుతాడని అన్నారు. దీనికి ఉదాహరణగా స్వామి చదువుసంధ్యలు లేని ఒక గోపాలబాలుని కథను వివరించారు.

ఒకరోజున ఒక నదీతీరమున ఆ బాలుడు తన పశువులను మేపుకుంటూఉంటే, అక్కడ ఒక పండితుడు కొన్ని మంత్రాలు చదువుతూ ఊపిరి పీలుస్తూ, కొంచెంసేపు బిగబడుతూ, మళ్ళీ వదులుతూండటం గమనించాడు. కుతూహలం ఆపుకోలేక ఆ పండితుని దగ్గరకు వెళ్ళి, మీరు ఏమి చేస్తున్నారని, ఎందుకు చేస్తున్నారని అడిగాడు. దానికి ఆ పండితుడు, ''నాయనా! నేను గాయత్రీమంత్రమును జపిస్తూ ప్రాణాయామం చేస్తున్నాను. ప్రతి రోజూ ఇలా చేస్తే భగవంతుడు నాకు ప్రత్యక్షమవుతాడని చేస్తున్నాను'', అని జవాబు చెప్పాడు. అప్పుడు ఆ కుర్రవాడు, ''నేను కూడా అలా చేయవచ్చా?'' అని అడిగాడు. దానికి ఆ పండితుడు నవ్వుతూ, ''ఎందుకు చెయ్యకూడదు? తప్పక చేయవచ్చు'', అని జవాబు చెప్పాడు.

ఆ రోజు నుండి పశువులకాపరి ప్రతి రోజూ ప్రాణాయామం చెయ్యడం మొదలుపెట్టాడు. ప్రాణాయామం చెయ్యడంలోని మెలకువలు అతనికి నేర్పకపోయినా, తనకు తెలిసిన మోటుపద్ధతిలోనే ప్రాణాయామం చేయడం మొదలుపెట్టాడు. శ్వాసనియంత్రణ చేయడానికి చాల కష్టపడ్డాడు. దానితోబాటు మంత్రం కూడా, అందులో మాటల యొక్క అర్థం తెలియకపోయినా, తనకు తోచిన రీతిలో జపించడం మొదలు పెట్టాడు. అయితే, ఆ పండితుని మాటలయందు అచంచలమైన విశ్వాసంతో క్రమం తప్పక ప్రతి రోజూ ఈ ప్రక్రియను కొనసాగించాడు. ఇలా చాల కాలము గడిచింది. ఇంకా భగవంతుడు అతనికి ప్రత్యక్షం కాలేదు. అయినప్పటికీ అతడు నిరాశ చెందలేదు. అతని భక్తికి మెచ్చి ఒక రోజున అతనికి శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయ్యాడు. ఆయనెవరో అమాయకుడైన ఆ గోపాల బాలునికి తెలియనందున ఆయననే ఆ విషయం అడిగాడు. దానికి శ్రీమన్నారాయణుడు సమాధానం

చెపుతూ, ''నాయనా! నేను భగవంతుడను, భక్తితో నీవు చేసిన ప్రాణాయామమునకు మెచ్చి నీ ముందు ప్రత్యక్షమయ్యాను'', అని చెప్పాడు. అప్పుడు మళ్ళీ ఆ బాలుడు, ''నీవు భగవంతుడవవునో కాదో నాకు తెలియదు. నిన్ను గుర్తు పట్టడానికి నా గురువును తీసికొని వస్తాను. ఇక్కడే ఉండు'', అని చెప్పి తన గురువును తీసికొని వచ్చే లోపల శ్రీమన్నారాయణుడు అక్కడి నుండి వెళ్ళిపోతాడేమోనని అనుమానించి ఆయనను ఒక చెట్టుకు కట్టివేసి, ఆ పండితుని తీసికొని రావడానికి వెళ్ళాడు. ఆ కుర్రవానితో రావడానికి పండితుడు మొదట్లో కొంచెం సందేహించాడు, కాని అతడు పదేపదే ప్రాధేయపడడంచేత చివరకు అంగీకరించాడు. ఆ బాలునితో కలసి చెట్టు దగ్గరకు వచ్చిన పండితునికి ఆ ప్రదేశంలో శ్రీమన్నారాయణుడు ఎక్కడా కనబడలేదు. కాని ఆ బాలుడు మాత్రం, ''నీ రూపమును [illegible] చూసి ఆయన నువ్వు భగవంతుడేనని [illegible] చేసేదాకా నిన్ను నేనెలా నమ్మగలను?''. అని శ్రీమన్నారాయణుని ప్రశ్నించాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు ఒక్క క్షణంపాటు తన దివ్యమంగళస్వరూపమును ఆ పండితునికి చూపించాడు. అప్పుడా పండితుడు ఆ గోపాలబాలుని ముందు మోకరిల్లి, ''నువ్వు నాకు సత్యమును బోధించావు. నువ్వే నాకు గురువు'', అని స్తుతించాడు.

## ''త్యాగేనైకే అమృతత్వ మానశుః''

మరొకరోజున స్వామి మహోన్నతమైన త్యాగము యొక్క విశిష్టతను గురించి వివరించారు. ''త్యాగము ప్రతి మానవునియొక్క ప్రప్రథమ లక్షణం కావాలి. త్యాగమంటే భగవంతునితో ఐక్యత చెందడంతో సమానమైనది'', అని స్వామి చెప్పారు. ఇందుకు ఉదాహరణగా స్వామి ఒక కథ చెప్పారు.

ఒకానొకప్పుడు దుర్భర దారిద్ర్యమును అనుభవిస్తున్న ఒక వృద్ధుడు తన భార్యతో కలసి జీవించేవాడు. ఒకరోజున తినడానికి ఇంట్లో ఏ పదార్థములూ లేనందున జబ్బుతో నున్న తన భార్యకు గంజిని తయారు చేసిపెట్టాడు. సరిగ్గా దానిని తన భార్యకు ఇవ్వడానికి తీసికొని వెళ్లే సమయంలో ఎవరో ఒక అపరిచిత వ్యక్తి వారు నివసించే గుడిసె తలుపు తట్టాడు. తలుపు తెరచి చూస్తే ఒక వ్యక్తి గుమ్మం ముందు నిలబడి, ''నాకు చాల ఆకలిగా ఉంది. తినడానికేమైనా ఇస్తారా?'', అని అడిగాడు. అప్పుడు ఆ గృహిణి తన భర్తవైపు చూచి తనకొరకు తయారుచేసి ఉంచిన గంజిని ఆకలితో ఉన్న ఆ వ్యక్తికి ఇమ్మని సౌంజ్ఞ చేసింది. ఆ వృద్ధుడు తన భార్య కొరకు తయారుచేసి ఉంచిన గంజిపాత్రను ఆకలితోనున్న ఆ వ్యక్తికి అందించాడు. ఒక్కక్షణం తరువాత ఆ అపరిచిత వ్యక్తి మాయమై ఆ స్థానంలో శ్రీమన్నారాయణుడు ఆ వృద్ధ దంపతుల యెదుట ప్రత్యక్షమై, ''మీ త్యాగభావమునకు నేను చాల సంతోషించాను. ఈ క్షణం నుండి మీరు ఎప్పుడూ ఆకలిబాధ ననుభవించకుందురు గాక!'', అని వరమిచ్చాడు.

## ఒక ఆంగ్లేయ భక్తుని అనుభవం

గుజరాత్‌లోని రాజ్‌కోటకు చెందిన ఒక ప్రముఖ వ్యాపారవేత్తకు, ఒక ఆంగ్లేయునికి మధ్య జరిగిన కాకతాళీయమైన ఒక సమావేశమును గురించి త్రయీబృందావనంలో భగవాన్ బాబావారు ఒక దివ్యోపన్యాసంలో చెప్పారు.

ఇంగ్లాండుకు చెందిన ఇ.ఎమ్. ఫారెస్టర్ అనే ఆంగ్లేయుడు ఠాకూర్‌దాస్ అనే వ్యాపారవేత్తకు అతిథిగా కొన్ని రోజులు గడుపడానికి భారతదేశం వచ్చాడు. ఆయన భారతదేశం వచ్చిన మొట్టమొదటి రోజు ఉదయాన్నే ఠాకూర్ దాస్ భగవాన్ బాబావారి

పటం యెదుట కూర్చుని తీవ్రమైన ధ్యానంలో మునిగియుండటం గమనించాడు. పూజ, ధ్యానం ముగించుకుని ఠాకూర్‌దాస్ బయటకి వచ్చిన తరువాత, ''జీవితంలో ఒక వ్యక్తి కోరుకునే మంచి, ప్రేమించే కుటుంబము, విశాలమైన ఇల్లు, మంచి ఆరోగ్యము, బాగా ఉచ్ఛస్థితిలోనున్న వ్యాపారము ఇలా సమస్తమూ నీకు ఇప్పటికే అమరి ఉన్నాయి కదా. నీ తీవ్రమైన ప్రార్థనద్వారా భగవంతుని ఇంకా ఏమి కోరుకుంటున్నావు?'', అని అడిగాడు. అప్పుడు ఠాకూర్‌దాస్ కొంచెంసేపు ఆలోచించి చిరునవ్వు నవ్వుతూ, ''ప్రాపంచిక సుఖాలు నీటిబుడగల వంటివి. అవి శాశ్వతమైనవి కావని, నిజమైన సుఖ శాంతులనిచ్చేవి కావని నేను గ్రహించాను. మనందరికీ భగవంతుని ప్రేమ కావాలి, మానసిక శాంతి కావాలి, పవిత్రమైన శాశ్వతానందము కావాలి. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రేమస్వరూపులు, ఆనంద స్వరూపులు. మనం భక్తిశ్రద్ధలతో, ఆర్తితో ప్రార్థన చేస్తే ఆ ప్రభువు ప్రేమానందములను మనపై వర్షిస్తారు. ప్రతి రోజూ నేను చేసేది ఇదే. విశ్వవ్యాప్తమైన ప్రేమస్వరూపుడు, కరుణామయుడు అయిన భగవాన్ బాబావారి అనుగ్రహం వలన నాకు ముక్తి లభిస్తుందని నా ప్రగాఢ విశ్వాసము'', అని ఆ ఆంగ్లేయ అతిథితో చెప్పాడు.

ఆ వ్యాపారవేత్త యొక్క హృదయపు లోతులలో నుండి వెలువడిన ఈ మాటలకు ఆ ఆంగ్లేయుడు తీవ్రంగా స్పందించాడు. అతడు అంతగా ధనవంతుడు కాడు. అందువలన ప్రాపంచిక సుఖాలను వెతుక్కోవడంలోనే అతడు ఇంతవరకు మునిగియున్నాడు. వెంటనే అతడు ఠాకూర్ దాస్ యొక్క పూజగదిలోనికి వెళ్ళి అక్కడ ఎన్నో గంటలసేపు ధ్యానంలో నిమగ్నమయ్యాడు. తనకు కూడా ప్రేమానందములను ప్రసాదించుమని భగవానుని ఎంతో ఆర్తితో ప్రార్థించాడు. ఇంతలో స్వామి అక్కడ ప్రత్యక్షమైనట్లు అతనికి ఒక దివ్యమైన అనుభూతి కలిగింది. కొంతసేపయిన తరువాత ఫారెస్టర్ ఆనందంతో వెలిగిపోతున్న ముఖంతో పూజ గది నుండి బయటకు వచ్చాడు. ఇంతటి దివ్యమైన అనుభూతి కలుగడానికి దోహదం చేసిన తన మిత్రుడు ఠాకూర్‌దాస్‌కు కృతజ్ఞతలు తెలుపుతూ ఆ రోజు నుండి ఆయననే తన గురువుగా భావించాడు.

ఆ సమయంలో స్వామి బొంబాయి పర్యటనకు వెళ్ళారు. ఠాకూర్‌దాస్, ఫారెస్టర్ కూడా స్వామి దర్శనం చేసుకోవడానికి బొంబాయి వచ్చారు. స్వామి వారిద్దరినీ ఇంటర్వ్యూకు పిలిచి, ఫారెస్టర్‌వైపు చూచి రాజ్‌కోట నుండి ఎప్పుడు వచ్చావని అడిగారు. ఇంకా, తాను అతనిని రాజ్‌కోటలో చూచానని కూడా చెప్పారు. రాజ్‌కోటలో స్వామి తాను ఉన్నానని చేసిన ప్రకటనకు ఫారెస్టర్, ఠాకూర్‌దాస్ ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

త్రయీబృందావనంలో స్వామి ఉన్న సమయంలో తమ దివ్యోపన్యాసములతోబాటు వయోవృద్ధులైన కొందరు భక్తులను కూడా విద్యార్థుల నుద్దేశించి ప్రసంగించుమని ఆదేశించారు. జనరల్ ఎస్. పి. మహదేవన్, శ్రీసత్యసాయి ఉన్నత విద్యాసంస్థ యొక్క మాజీ వైస్‌చాన్స్‌లర్ ప్రొఫెసర్ సంపత్, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు విభాగమునకు అధిపతిగా పనిచేసిన డా॥ రామరాజు మరియు ఇంగ్లాండు దేశమునకు చెందిన డా॥ గాడియా వీరిలో కొందరు. మొత్తంమీద, త్రయీబృందావనంలో విద్యార్థులు భగవాన్ బాబావారితో గడిపిన రోజులు మరపురాని మధుర క్షణాలు. అవి ఆధ్యాత్మికంగా వారిని ఉన్నతస్థాయికి కొనిపోయి, సమాజసేవలో తమ జీవితాలను సార్థకం చేసుకునేటట్లు ప్రోత్సహించాయి.

ఆంగ్లమూలం : వి. కె. నరసింహన్ అనువాదం : గరిమెళ్ళ కృష్ణమూర్తి

# సత్యోపనిషత్

## (గత సంచిక తరువాయి)

52. స్వామీ! మా ఆధ్యాత్మిక స్రవంతి ఎలా సాగాలి?

బాబా : 'న శ్రేయో నియమం వినా' అన్నారు. నదీప్రవాహం హద్దు ప్రకారం ప్రవహిస్తే ఎంతో ప్రయోజనకారిగా ఉంటుంది, హద్దు మీరితే ప్రమాదం. అదేవిధంగా జీవిత ప్రవాహానికి కూడా రెండు గట్లు ఉన్నాయి. ఒకవైపు గట్టు - ''సంశయాత్మా వినశ్యతి''; రెండో వైపు గట్టు - ''శ్రద్ధావాన్ లభతే జ్ఞానం''. ఈ రెండు గట్ల మధ్య నీ జీవన స్రవంతి ప్రవహించాలి. నీకున్న విశ్వాసం దృఢమైనదిగా ఉండాలి. సంశయం ప్రవేశించెనా, జీవితం చిల్లులకుండలా మారుతుంది. వేర్లకు నీరు పోస్తే చాలు, అది మొక్కకంతా చేరుతుంది. అదేవిధంగా నీవు నీ జీవనవృక్షానికి విశ్వాసమనే నీరు అందించాలి. నీరు లేకపోతే వృక్షము ఎండిపోయి వంటచెఱకు (Firewood)గా మారిపోతుంది. అలాగా నీలో సంశయం ప్రవేశించిందంటే సర్వమూ నిరర్థకమే, ఏదీ ఫలించదు. ఒక చిన్న కథ: ఒక ఊరిలో ఒక మహాపండితుడుండేవాడు. ఆయనకి ప్రతి రోజు ప్రక్క ఊరి నుండి ఒక గొల్లపిల్ల పడవలో కాలవదాటి పాలు తెచ్చి పోసేది. కాని ఆ అమ్మాయి ప్రతి రోజు ఆలస్యంగా రావటంవల్ల ఈ పండితులవారి దినచర్య కుంటుపడుతున్నది. ఒక రోజున ఆ గొల్లపిల్లని ఆలస్యానికి కారణం అడిగాడు. దానికి ఆమె అన్నది: ''స్వామీ! నేనేం చేసేది? ప్రతి రోజు పడవవాడు ఉన్నవారిని, పెద్దవారిని మొదటిట్రిప్పులో ఎక్కించుకొని మాకు ఖాళీ లేదంటున్నాడు. రెండవ ట్రిప్పులో ఎక్కి వచ్చేసరికి ఆలస్యమవుతున్నది, క్షమించండి''. అప్పుడు పండితులవారన్నారు: ''ఏమీ! కాలవ దాటడానికి పడవ ఎక్కాలా? పిచ్చిపిల్ల! అక్కర్లేదు. కాలవ ఒడ్డున నుంచొని, ''ఓం నమో వాసుదేవాయ'' అనే మంత్రాన్ని చెప్పుకో. వెంటనే కాలవ నీకు దారి విడుస్తుంది.'' ఆ ప్రకారమే చేస్తానన్నది. మరునాడు రోజూకంటే చాల ముందుగా పాలను తీసుకువచ్చింది. పండితులవారు కారణమడిగారు. ''స్వామీ! తమరు సెలవిచ్చినట్లుగా నేను కాలవ గట్టున నిలబడి, ''ఓం నమో వాసుదేవాయ'' అని మంత్రం చెప్పాను. వెంటనే కాలవ దారి విడిచింది. కనుకనే ఈ రోజు ముందుగా రాగలిగాను'' అన్నది. పండితులవారికి నమ్మశక్యం కాలేదు. ప్రత్యక్షంగా పరీక్షిద్దామనుకున్నారు. ''నేను కూడా నీతో వస్తాను, పద'' అన్నారు. ఇరువురు కాలవగట్టు చేరారు. ఆ అమ్మాయి, ''ఓం నమో వాసుదేవాయ'' అని స్మరించగా కాలవ చీలి దారి విడిచింది. ఆమె సునాయాసంగా నడుచుకుంటూ వెళ్ళింది. ఇంక పండితులవారు కూడా ప్రయాణమయ్యారు. ''ఓం నమో వాసుదేవాయ'' అని అంటున్నాడేగాని కాలవ దారి విడుస్తుందో లేదో అని సంశయమొచ్చింది. కట్టుకున్న పంచ తడుస్తుందేమోనని పైకి లాక్కుని పట్టుకున్నాడు. ఇంకేముంది? థపీలుమని పడిపోయాడు. చూశావా! గొల్లపిల్ల ఆ మంత్రాన్ని

పరిపూర్ణంగా విశ్వసించడంచేత సునాయాసంగా కాలువ దాటగల్గింది. కాని పండితులవారికి తన మంత్రంపైన తనకే నమ్మకం లేదు. కనుకనే జారిపడ్డాడు. సంశయం పనికి రాదు.

ఇంక రెండవ గట్టు: ''శ్రద్ధావాన్ లభతే జ్ఞానం.'' శ్రద్ధ లేకపోతే ఏ పనిలోను విజయం సాధించలేవు శ్రద్ధ కలగాలంటే నీవు నమ్మినదానిపైన, నీవు చేసే పనిపైన నీకు ప్రేమ కలగాలి. ప్రేమ ఉంటే ఏ పనైనా శ్రద్ధతో చేస్తావు. విద్యార్థి శ్రద్ధతో చదివితేనే విద్య అలవడుతుంది. అదేవిధంగా జ్ఞానం లభించాలంటే కూడా శ్రద్ధ అవసరం. అయితే ఏ జ్ఞానం? ప్రాపంచిక జ్ఞానమా? పదార్థ జ్ఞానమా? పుస్తక జ్ఞానమా? కాదు, కాదు. అనుభవజ్ఞానం. ఇది శ్రద్ధతోనే లభిస్తుంది. కనుక సంశయం లేకుండ శ్రద్ధతో అనుభవజ్ఞానం సంపాదించి జీవితాన్ని సాగించు. ఇదే నీవు తెలుసుకోవలసింది.

**53.** **భగవాన్ అనుభవ జ్ఞానమంటున్నారు. మాకు అంతా తెలుసనుకుంటున్నాము. ఇది జ్ఞానం కాదా?**

**బాబా:** కానేకాదు. మీకు తెలియదని కూడా తెలియదు పాపం! ఏదో కొద్దిగా తెలుసుకొని అంత తెలుసనుకుంటున్నారు. ఇది మూర్ఖత్వం. మీరు గ్రహించవలసింది చాల ఉంది. ఇదిగో చూడండి (ఇక్కడ స్వామి తన చేతి రుమాలు కొద్ది భాగం మాత్రం పైకి కనపడేలా గుప్పెట్లో ముడిచి పట్టుకున్నారు.) ఇదేమిటి? అని ప్రశ్నిస్తే మీరేమంటారు? Piece of cloth (గుడ్డముక్క) అంటారు. కాని ఇది సరియైన సమాధానమేనా? సంపూర్ణ జ్ఞానమేనా? మీకు తెలిసింది ఇంతే! అయితే ఇప్పుడు చెప్పండి (స్వామి రుమాలును గుప్పెట్లోనుండి తీసి పూర్తిగా విప్పి అడుగుతున్నారు) ఇదేమిటి? అని అడిగితే, చేతిరుమాలు అని చెబుతారు. ఇదే సరియైన జవాబు. దీనినే అవేర్‌నెస్ (సంపూర్ణ జ్ఞానం) అనవచ్చు. కొద్దిగా చూసి 'గుడ్డముక్క' అన్నారు. తరువాత పూర్తిగా చూసి 'రుమాలు' అన్నారు. మొదట చెప్పినది పూర్తిగా తెలుసుకొని చెప్పినది కాదు. అవేర్‌నెస్ అంటె పూర్ణజ్ఞానం; మిడిమిడి జ్ఞానం కాదు, పాక్షిక జ్ఞానం కాదు. **Awareness is full and complete knowledge**

**54.** **స్వామీ! 'అవేర్‌నెస్' అంటే పరిపూర్ణ జ్ఞానమనీ, కొద్దిపాటి విషయపరిజ్ఞానం కాదనీ సెలవిచ్చారు. మేమెంత పొరపాటు పడుతున్నామో ఇప్పుడు మాకు తెలిసింది. మరి ఈ 'అవేర్‌నెస్' రావాలంటే ఆధ్యాత్మికం అవసరమా?**

**బాబా :** చాల అవసరం. ఆధ్యాత్మిక మార్గంలోనే అవేర్‌నెస్ కలుగుతుంది, ఆధ్యాత్మిక దృక్పథంవల్ల విషయాలు తేటతెల్లమవుతాయి, సరియైన అవగాహన ఏర్పడుతుంది, యథార్థలంతరార్థాలు బోధపడుతాయి. ఆధ్యాత్మికం లేనప్పుడు కేవలం బుకిష్ నాలెడ్జి (పుస్తకజ్ఞానం), సూపర్‌ఫిషియల్‌నాలెడ్జి (మిడిమిడి జ్ఞానం), జనరల్ నాలెడ్జి (సాధారణ విషయ పరిజ్ఞానం) - ఈ మూడింటిని మాత్రమే నీవు పొందగలవు. ఒక్క ఆధ్యాత్మిక మార్గంలోనే పరిపూర్ణజ్ఞానం సులువుగా లభిస్తుంది. ఒక విత్తనం మొలకెత్తాలంటే ఏమి చేయాలి? భూమిలో నాటి నీరు పోయాలి. అంతేగాని టిన్‌లో పెట్టి నీరు పోస్తే

అది మొలకెత్తుతుందా?! అదేవిధంగా అవేర్‌నెస్ అనేది ఆధ్యాత్మిక క్షేత్రంలోనే వృద్ధినొందుతుందిగాని, ప్రాపంచిక క్షేత్రమనే టిన్‌లో కాదు. ఆధ్యాత్మిక దృక్పథంలో లభించినదే సరియైన అవేర్‌నెస్.

55. **స్వామీ! మరి విద్యాలయాల్లో, విశ్వవిద్యాలయాల్లో మేము పొందే జ్ఞానంలో ఎక్కడో ఏదో లోపమున్నట్లుగా కనిపిస్తున్నది. అది ఎక్కడుందంటారు?**

**బాబా:** విద్యారంగంలో మీరు పొందే నాలెడ్జి (జ్ఞానం) సరియైనరీతిలో వినియోగపడుట లేదు. మీకున్న నాలెడ్జిని మీరు చక్కగా **Skill** చేయాలి. అనగా ఆచరణలో పెట్టి నైపుణ్యాన్ని సాధించాలి. అప్పుడే నాలెడ్జికి, నైపుణ్యానికి మధ్య బ్యాలన్సు కుదురుతుంది. కాని ఈనాడు మీరు నాలెడ్జిని **Skill** చేయడానికి బదులు **Kill** చేస్తున్నారు. అనగా వ్యర్థం చేస్తున్నారు. కనుకనే బ్యాలన్సు తప్పిపోతున్నది. నేటి విద్యావిధానంలో గల లోపం ఇదే!

56. ***భగవాన్! మనిషికి అవేర్‌నెస్ అనేది ముఖ్యమనీ, అది విద్యాసంస్థల్లో లభ్యం కావటం లేదనీ తెలుసుకున్నాము. మీరు భగవత్స్వరూపులు. కనుక మీరే అనుగ్రహించి ఈ అవేర్‌నెస్‌ను మాకు కలిగించరాదా?***

బాబా : అయితే ఇంక నీవు చేసేదేముంది! అంతా భగవంతుడే చేస్తే నీ మనస్సు, నీ బుద్ధి అంతా వ్యర్థమేగా! భగవంతుడనుగ్రహించిన ఈ పవిత్రమైన ఉపకరణాలు నిరర్థకమేనా? పురుషప్రయత్నం అక్కర్లేదా? భగవంతుడు అన్నీ ఇచ్చాడు. వాటిని తగిన రీతిలో వినియోగపరచుకోవలసిన వాడవు నీవే. తల్లి అన్నం కలుపుతుందేగాని బిడ్డకు బదులు తాను తినగలదా? పిల్లవాని కాలికి దెబ్బ తగిలితే తల్లి బాధ పడుతుంది. కాని బ్యాండేజి కట్టుకోవలసింది పిల్లవాడే కదా! నీవు తట్టముందు కూర్చున్నావు. అందులో పొటేటో, చపాతీ వడ్డించారు. అవి పొట్టలోకి చేరాలంటే నీ నోటికి, చేతికి పని పెట్టాలి కదా! అలాగే నీ మనస్సుకి, బుద్ధికి కూడా పనిపెట్టు. అంతా అర్థమవుతుంది. కృషి ఉంటేనే కృప ఉంటుంది. కృషితో ఋషివి కాగలవు. ''కృషితో నాస్తి దుర్భిక్షమ్'' అన్నారు. కృషితో సాధించలేనిది లేదు. దైవాన్ని స్మరిస్తూ నీ పని నీవు చేసుకుంటూ సాగిపో. అర్జునుడికి కూడా కృష్ణుడిదే చెప్పాడు: ''మాం అనుస్మర యుధ్యచ'' అనగా, నన్ను తలుచుకుంటూ యుద్ధం చేయమన్నాడు. హనుమంతుడు రామనామంతోనే సముద్రాన్ని దాటగల్గాడు. కనుక కృషి చేయి, తప్పక కృప ఉంటుంది.

57. ***ఏమో స్వామీ! అవేర్‌నెస్ దాకా పోవడమెందుకు? సమాజంలో ఏ ఇద్దరి మధ్యకూడా సయోధ్య కనపడటం లేదు; భిన్నాభిప్రాయములు, భేదాభిప్రాయములు తప్ప అన్యోన్యత కనపడటం లేదు. ఎందుకంటారు?***

బాబా : ఇక్కడ నీవు బాగా గ్రహించవలసిన విషయం ఒకటుంది. ఏ ఇద్దరికీ పడటం లేదంటున్నావు, అన్యోన్యత లేదంటున్నావు. ఎందువల్ల? ఈనాడు సమాజంలో అన్ని కలహాలకు, అనర్థాలకు, అపోహలకు, అనుమానాలకు, మూలం వ్యక్తులమధ్య సరియైన అండర్‌స్టాండింగ్ (అవగాహన)

లేకపోవడమే! అవగాహన లేకపోవడంవల్లనే ఒకరితో ఒకరు సరిపెట్టుకోలేక పోతున్నారు. వ్యక్తి అండర్ స్టాండింగ్ (అవగాహన) ఉన్నప్పుడే అడ్జస్ట్‌మెంట్ (సరిపెట్టుకోవడం) సాధ్యమవుతుంది. ఒక చిన్న ఉదాహరణ: నీకు, నీ భార్యకి మధ్య మంచి అండర్‌స్టాండింగ్ ఉన్నప్పుడు నీవు ఆఫీసు నుండి ఇంటికి ఎంత ఆలస్యంగా వచ్చినా ఇబ్బంది ఉండదు. నీవు ఆఫీసులో ఎంతో కష్టపడుతున్నావని భావించి ఇంటికి రాగానే ఎంతో ఆప్యాయంగా కాఫీ, టిఫిను అందించి సేద దీరుస్తుంది. అనగా నీ ఇద్దరి మధ్య మంచి అవగాహన ఉండటంవల్ల నీవు ఆలస్యంగా వచ్చినా ఆమె సరిపెట్టుకుంటుంది. ఇదే అవగాహన లేదనుకో, నీవు ఆఫీసు నుండి రావడం 5 నిమిషాలు ఆలస్యమైనా ఆమె ఇంట్లో నరకం సృష్టిస్తుంది. ఎందుకింత ఆలస్యం చేశావు? ఎక్కడికి వెళ్ళావు? ఎవరిని కలిశావు? అని ప్రశ్నలతో హోరెత్తిస్తుంది. అనగా నీ పట్ల సరియైన అండర్‌స్టాండింగ్ లేకపోవడంవల్ల అడ్జస్ట్ కాలేకపోతుంది. ఇంతే లేదా! సంఘంలోని అన్ని సమస్యలకు కారణం ఇదే, సందేహం లేదు. (సశేషం)

# గ్రంథసమీక్ష

## "బాబా జీవితమే జగతికి సందేశం"

రచయిత : భాట్టం శ్రీరామమూర్తి. వెల : రూ॥ 65

ప్రాప్తిస్థానము : శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయం.

ఈ గ్రంథం భగవాన్ బాబావారి జీవితాన్ని, వారి సందేశాలను అధ్యయనం చేయదలచినవారికి ఒక కల్పవృక్షమే. రచయిత శ్రీవారి చిరకాల భక్తుడు కావడంచేత, శ్రీవారి దివ్యసన్నిధిలో తాను అనేక విషయాలను అనుభవపూర్వకంగా తెలుసుకొనే అదృష్టానికి నోచుకోవడంచేత కొన్నికొన్ని ఘట్టాలను కన్నులకు కట్టినట్లే వర్ణించారు; శ్రీవారి అవతార కార్యకలాపాలను అతి వాస్తవిక దృక్పథంతో పరిశీలన చేశారు; భావుకత చూపించారు; భక్తిని కురిపించారు.

దీనిలో మూడు భాగాలున్నాయి. ప్రథమ భాగంలో శ్రీవారి బాల్యం-బడిచదువు- అన్న దగ్గర స్కూలుచదువు - కడగండ్లు, ఆదర్శాలు - స్కౌటు సేవ దివ్యమహిమలు - అవతార లక్షణాలు వర్ణించబడ్డాయి. రెండవభాగంలో స్థూలంగా ప్రసంగాలు, ప్రబోధాలు క్రోడీకరించబడ్డాయి. మూడవభాగంలో బాబావారి పూర్వావతార వైభవాలు, భక్తి, జ్ఞానం శ్లాఘించబడ్డాయి. వ్యాఖ్యానం సులభ సుందర సరళశైలిలో సాగింది.

శ్రీవారు మానవహృదయాలలో సత్య ధర్మ శాంతి ప్రేమ భక్తిజ్ఞాన బీజాలను నాటారు. సేవాధర్మం, త్యాగభావం, ఉపకారగుణం ఆశించి ఆచరించి ఆచరింపజేసి ఆపదలోని వారిని ఆదుకొని ఖండఖండాంతర వాసులలో జ్ఞానజ్యోతిని వెలిగించారు. "చెప్పినట్లు చేస్తారా?" అనే నాటకం ద్వారా సత్యం వచించటం కాదు, ఆచరించాలని ప్రబోధించారు. దేశభక్తిని బాల్యం నుండియే వివిధ ఘట్టాలలో నూరిపోశారు... ఇంకా ఇటువంటి అనేక విషయాలను ఈ పుస్తకంలో తెలుసుకొని తెలివిని పెంచుకోవచ్చు.

"ఆ కరుణామయుడు, ఆ అమృతమూర్తి, ఆ జ్యోతిస్వరూపుని దివ్యకాంతులు హృదయాంత రాళాలను తేజోవంతం చేస్తాయి. వారి కేలూపుతో వెయ్యివైకుంఠాలు కదిలినట్లు ఉంటుంది. వారి మృదుమధుర దరహాసం శాంతిదేవతకు స్వాగత గీతం పలికినట్లే ఉంటుంది..." ఈవిధంగా సాగుతుంది భాట్టం శ్రీరామమూర్తిగారి రచన.

ఈ పుస్తకం ద్వారా రచయిత శ్రీవారికి అర్ధసహస్రపత్రార్చన చేసి చరితార్థులయినారు.

"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి (ప్రశాంతినిలయం)

# శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,

ప్రశాంతినిలయం - 515 134 అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా
దిగుమతిదారు / ఎగుమతిదారు కోడ్ నెంబరు 0990001032
రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎగుమతి దారుల కోడ్ నెంబరు. 2001198



## ప్రస్తుతం మా వద్ద లభ్యమవుతున్న పుస్తకముల జాబితా



| వరుస నెంబరు | పేరు | ధర రూ.పై |
|---|---|---|
| 1. | ఉపనిషత్ వాహిని | 8-50 |
| 2. | గీతా వాహిని | 18-00 |
| 3. | ధర్మ వాహిని | 8-50 |
| 4. | ప్రశాంతి వాహిని | 11-00 |
| 5. | ప్రశ్నోత్తర వాహిని | 10-00 |
| 6. | భాగవత వాహిని | 18-00 |
| 7. | రామకథారస వాహిని (1వ భాగం) | 35-00 |
| 8. | రామకథారస వాహిని (2వ భాగం) | 18-00 |
| 9. | లీలాకైవల్య వాహిని | 4-50 |
| 10. | సత్యసాయి వాహిని | 14-00 |
| 11. | జ్ఞాన వాహిని | 11-00 |
| 12. | ధ్యాన వాహిని | 15-00 |
| 13. | ప్రేమ వాహిని | 9-00 |
| 14. | విద్యా వాహిని | 12-00 |
| 15. | సూత్ర వాహిని | 8-50 |
| 16. | అద్భుతమూర్తి | 37-00 |
| 17. | ఆత్మారామమ్ | 34-00 |
| 18. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1978) | 18-00 |
| 19. | నీలగిరి వేసవి వెన్నెల (1976) | 14-00 |
| 20. | భజనావళి | 27-50 |
| 21. | మనస్సు - మర్మము | 14-00 |
| 22. | సందేహ నివారిణి | 24-00 |
| 23. | చిన్నకథ (1వ భాగం) | 17-00 |
| 24. | చిన్నకథ (2వ భాగం) | 18-00 |
| 25. | చిన్నకథ (3వ భాగం) | 23-00 |
| 26. | సత్యం శివం సుందరం (1వ భాగం) | 40-00 |
| 27. | సత్యం శివం సుందరం (2వ భాగం) | 43-00 |
| 28. | సత్యం శివం సుందరం (3వ భాగం) | 38-00 |
| 29. | సత్యం శివం సుందరం (4వ భాగం) | 27-00 |
| 30. | మణిమాల | 20-00 |
| 31. | వచనామృతము | 18-50 |
| 32. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1993) | 27-00 |
| 33. | వాక్వవిభూతి | 6-00 |
| 34. | ప్రేమసుధా స్రవంతి | 52-00 |
| 35. | శ్రీసత్యసాయిగీతామృతము | 46-00 |
| 36. | సాయిబాటలో నా పయనము | 55-50 |
| 37. | ప్రబోధ పంచామృతము | 15-00 |
| 38. | సనాతన సారథి 70వ జన్మదిన ప్రత్యేకసంచిక | 25-00 |
| 39. | శ్రీసత్యసాయి గీతా | 30-00 |
| 40. | శ్రీకృష్ణుడు - శ్రీసత్యసాయి | 28-00 |
| 41. | భక్తోద్ధారక శ్రీసత్యసాయి | 28-00 |
| 42. | మూఢమతి - ముక్తమతి | 23-50 |
| 43. | ప్రేమజ్యోతి | 45-00 |
| 44. | మాతృశ్రీ ఈశ్వరమ్మ | 44-00 |
| 45. | భక్తి రసాయనం | 18-00 |
| 46. | జయభేరి | 17-00 |
| 47. | శ్రీసత్యసాయి విన్నపములు | 17-00 |
| 48. | పరమానంద శ్రీసాయి సన్నిధి | 5-00 |
| 49. | శ్రీసత్యసాయి అనుగ్రహం | 5-00 |
| 50. | మూలపురుషుడు శ్రీ సత్యసాయి | 5-00 |
| 51. | శ్రీసత్యసాయీశోపనిషత్ | 5-00 |
| 52. | బాబా జీవితమే జగతికి సందేశం | 65-00 |
| 53. | పూర్ణావతారి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా | 45-00 |
| 54. | నాలో నిండిన వెలుగు | 20-00 |
| 55. | శ్రీ సాయిరామ శతకం | 5-00 |
| 56. | సాయిరామ స్తుతిమాల | 3-00 |
| 57. | భగవాన్ శ్రీ సత్యసాయికి జన్మదిన కానుక | 5-00 |
| 58. | స్మృతి పథంలో శ్రీమతి ఈశ్వరమ్మ | 5-00 |
| 59. | శ్రీసాయి మంజీరాలు | 10-00 |
| 60. | బృందావనంలో శ్రీసాయిసన్నిధి | 10-00 |
| 61. | సుగుణానిధి శ్రీ సత్యసాయి | 5-00 |
| 62. | శ్రీ సత్యసాయి దివ్యవాణి | 5-00 |
| 63. | నామస్మరణ విశిష్టత | 18-00 |
| 64. | ప్రేమబంధం | 25-00 |
| 65. | శ్రీ సత్యసాయి మహిమామృతము | 20-00 |

